# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 13 | రాజమహేంద్రవరము 16-10-1990, 1-11-1990 | సంచికలు 24, 25



—* ఈ సంచికలో రచయితలు

1. ఆచార్య యస్వీ జోగారావు
2. డాక్టర్ మిరియాల రామకృష్ణ
3. శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు
4. డాక్టర్ సి. సూర్యనారాయణ,
5. డాక్టర్ లక్కంశెట్టి కోటమల్లేశ్వరరావు,
6. శ్రీ బులుసు వేంకటేశ్వర్లు,
7. శ్రీ ప్రఖ్య మధుబాబు,
8. ఆచార్య దర్భా సూర్యనారాయణ,
9. శ్రీ పి. వి. ఎల్. సుబ్బారావు
10. శ్రీ పాతూరి రఘురామయ్య
11. కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

రాబోయే సంచికకు స్వీకరించినవి :

1. కరుణశ్రీ శ్రీ పాపయ్యశాస్త్రి, 2. తెలుగు తేజం (కవిత), 3. ప్రాచీన సాహిత్యామృతం - ఉన్నది ఉన్నట్లు - నన్నయ భారతావతారిక 4. పి.నా.రె. మనిషి-చిలక 5. మైసూరు సంస్థానం-కవులు-గ్రంథాలు 6. దాసు శ్రీరాములుగారి "బ్రాహ్మణ ప్రశంస"-ఒక పరిశీలన 7. చిన్మయానంద గీతా జ్ఞాన యజ్ఞం-సమీక్ష 8. భరత ప్రశంస-కవిత.

1, 16 తేదీలలో ప్రచురింపబడును

విడి ప్రతి 0-60 పై. | 6 మాసములకు రు. 6-50 | సంవత్సర చందా రు. 12-00

## సంపాదకుని మాట

ఈ మధ్య అనేక సాహిత్య సభల్లో - సమాజంపై సాహిత్యం ప్రభావం - సామాజిక స్పృహ - సామాజిక చైతన్యం వంటి మాటలు తరచుగా వింటున్నాము. ఏదో చెప్పాలి ఏవేవో చెయ్యాలి అన్న ఆవేశం ఉండటం ఒక మార్పుకి కోరుకోతగినది అయినప్పటికీ సరైన పంథాలో ఆ ఆవేశం నడవటం చాలా అవసరం. ఆలోచనలకు ఒక సరైన ఆకృతి ఆవేశాలకు సరైన గమ్యం ఉండి తీరాలి. అప్పుడే వాటికి ప్రయోజనం ఉంటుంది.

స్పృహలేని చైతన్యం, చైతన్యంలేని స్పృహ మనకి వద్దు.

సాహిత్యం అంటే కేవలం కవిత్వం మాత్రమే అనేఅభిప్రాయం కూడా సరిఅయినది కాదు.

అదృష్టవశాత్తు మనకి కవులు; పండితులే కాదు కవిపండితులు, పండితకవులు కూడా ఉన్నారు. వారిని గుర్తించి ప్రోత్సహించడం సాహిత్యానికి సౌరభంతోపాటు క్రొత్త జీవితం ఇవ్వడమే కాదు సాహిత్య ప్రయోజనం కూడా తెలియచేయుతుంది.

ఈ సాహిత్య యజ్ఞానికి "సమాలోచన" తన వంతు ప్రయత్నం చేస్తుంది. ఆ వివరాలు ఈ సంచికలోనే చదవండి. అభిమానులందరూ తగిన చేయూత నిస్తారని ఆశిస్తున్నాము.

— సంపాదకుడు

## కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి స్మారక సాహితీ పురస్కారము

1980 జనవరి నుంచి 1984 డిసెంబరు వరకు ఈ ఐదుసంవత్సరాల పరిధిలో తెలుగులో ప్రచురించబడ్డ స్వతంత్ర గ్రంథాలకు సాహితీ పురస్కారం లభిస్తుంది.

ఈ కాలంలో ప్రచురింపబడ్డ

1. ఉత్తమ సాంప్రదాయిక కావ్యానికి రు. **1,116** ల నగదు పురస్కారం.
2. ఉత్తమ సాహిత్య విమర్శకు రు. **1,116** ల నగదు పురస్కారం.
3. ఉత్తమ ఆధునిక కవితా సంపుటికి రు. **1,116** ల నగదు పురస్కారం.

రచయితలు తమ గ్రంథాలను మూడేసి కాపీలు చొప్పున డిసెంబరు 15వ తారీఖులోపల ఎడిటర్ "సమాలోచన" 6-4-24, T. Nagar, Rajahmundry-533 101 ఎడ్రసుకు పంపాలి.

వాటిపై తుదినిర్ణయం "సమాలోచన"దే.

పురస్కార గ్రహీతలకు రాజమండ్రిలో ఏర్పాటు చేయబడే స్మారక పురస్కార సభలో సభాముఖంగా నగదు అందచేయబడుతుంది.

ఈ పురస్కారాలకు అవసరమైన నగదు శ్రీ శాస్త్రిగారి కుమారులైదుగురు సమకూరుస్తారు.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**

పాతబడినకొద్దీ కొన్ని వ్యాసాలు కొత్తవుంటాయి. వాటిలో ఆనాటి అవగాహన చారిత్రక సాక్ష్యంగా ఉపకరిస్తుంది కనక వాటి అవసరం కూడా పెరుగుతూ ఉంటుంది. ఈ దృష్టితో 1980కి ముందు వెలువడిన కొన్ని వ్యాసాలను- ముఖ్యంగా ఆధునిక సాహిత్య చైతన్యం గురించి వ్రాసిన వ్యాసాలను - ఈతరం విద్యార్థులకోసం సమాలోచన పునర్ముద్రిస్తోంది. అయితే, మాకలాంటి వ్యాసాలను పంపేవారు రచయిత అనుమతిని కూడా జతపరచవలసి ఉంటుంది. ఆ వ్యాసం మీకెందుకు మళ్ళీ చదవాలనిపించిందో కూడా చెప్పాలి. దాని ప్రాముఖ్యాన్ని వివరిస్తూ మాకు దాని కాపీని, ఆ రచయిత ప్రస్తుత చిరునామాని, వారి లిఖితపూర్వక అనుమతిని పంపాలి.

ఈ సంచికలో ప్రచురిస్తున్న వ్యాసం ఆచార్య యస్వీ జోగారావుగారు 1976 లో ఆకాశవాణిలో (29-3-1976) చదివిన ప్రసంగ వ్యాసం. ఇదెక్కడా అచ్చయినట్లు లేదు.

## ఎంచిన మంచివ్యాసాలు (1970-80)

దీన్ని సేకరించి మాకందించిన వారు డా. మిరియాల రామకృష్ణ, తెలుగుశాఖ, ప్రభుత్వకళాశాల, రాజమహేంద్రవరం. వారిలా రాస్తున్నారు.

'ఈ వ్యాసంలో ఆచార్య యస్వీ జోగారావుగారి సాహిత్యవివేచనాశక్తి, మూల్యగుణనశక్తి ప్రస్ఫుటమవుతాయి. ఇందులో భావకవిత్వం ఆంగ్లంలోని కాల్పనిక కవితోద్యమానికి మానసపుత్రిక అని నిర్దేశించారు. భావకవితలో కథకంచికి పోయిందనీ భావమే కవితావస్తువయిందనీ మనదేశంలోని ఆధునిక కవి పరిపూర్ణ వ్యక్తిత్వం లేదనీ విశ్వనాథ, కవితాశిల్పంలో నవ్యత్వానికీ దృక్పథంలో సంప్రదాయానికీ వంతెన వేశాడనీ అన్నారు. పాశ్చాత్యదేశాల్లో సాహిత్యంపై సమాజప్రభావ మెక్కువ అని శ్రీశ్రీ గురించి వ్యాఖ్యానిస్తూ అన్నారు. శ్రీశ్రీ అసలు కటువులు చెప్పకుండా భజన చేయించుకున్నాడేమో అని సందేహించారు. శేషేంద్ర గురించి మొహమాటంలేని తీర్పునిచ్చారు.''

# 1. "నాదృష్టిలో ఆధునిక కవితా ధోరణులు"

— శ్రీ ఆచార్య యస్వీ జోగారావు

ఆంధ్రజాతిలో చైతన్యం తెచ్చిన వాడు వచ్చినవాడు వీరేశలింగం. ఆమహామహుడి రాకతోనే అప్పటికి చిరనిద్రాణంగావున్న ఆంధ్రజాతి జాగృతమైంది, సాహిత్యం చైతన్య చకచ్చకితమైంది. ఆయనకు సమకాలికులూ అర్వాచీనులూ అయిన కవులకు రచయితలకూ చేతులలో ఒక అభినవ దృగధ్వం గోచరమై ఆంధ్ర సాహిత్యచరిత్రలో ఆధునికయుగోదయమైంది. అయితే నవకవితా నందనోద్యానంలో గురజాడవారి ముత్యాలసరాలతో గొంతు సవరించుకొంది కొత్తగా ఒక కోయిలమ్మ రాయప్రోలు వారి రమ్యాలోకంలో భావస్పందనం పొంది బంధుర గానం చేసింది.

ఏ రమ్యమావికొమ్మ మెలగత్తెనదో
రాక కోయిలమ్మ ఆ
హో యనిపించె కుహూ కుహూ స్వర
మశ్రుతపూర్వమైన గా
న్యాయమూగా పురాస్మృతి సుధాంత
మూగా రసరాజ్యభోగ సం
ధాయకమై రహించె కవితాలతికా
కలమంత్రపాఠికై

ఆ పిలుపందుకొన్నాడొక కుమార
గంధర్వుడు కృష్ణశాస్త్రి.
ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై

ఈ యడవి దాగిపోనా
ఎటులైన నిచటనే యాగిపోనా

అని తన గాత్రగాంధర్వంతో సహృదయ హృదయ క్షేత్రాల్లో సద్యోహృద్యాలైన అనుభూతి సంగీతసౌరభాలు మేళవించాడు. ఆ ధోరణిలో వున్న ఒక అనిర్వచనీయ మాధుర్యాన్ని కొందరో కవి కుమారు లెగబడ్డారు. మన కదుష్ణహృదయాల్ని కదిలించేటటువంటి, నిత్యజీవిత సత్యాలను కావలించుకొనేటటువంటి బహుముఖీన బంధుర భావాల అపూర్వస్వరకల్పనల కాకరమై పరంపరగా సాగిన వారి చిన్నారి పొన్నారి రచనల జీవనాడిలో కనిపించిన సామ్యవైశిష్ట్యాలను బట్టి వారి దోవ కవిత్వపు తరగతిగా పరిగణించబడి 'భావ కవిత్వం' అనే పేరు సంపాదించుకొంది. అది సుమారొక వందసంవత్సరాలు ముందుగానే పాశ్చాత్యదేశాల్లో ప్రగల్భించిన కాల్పనిక కవితోద్యమానికి మానసపుత్రిక. గతంలో నిపుణకవుల నిర్మాణమార్మికతతో ఒక స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకొన్నా అనాటి కావ్యాలన్నీ వస్తుప్రధానాలూ, ఆ వస్తువు లన్నీ పురాణప్రణీతాలు, ఆ కవితలన్నీ ప్రాచీనసంప్రదాయ సమయ పరిపాలితాలూను. భావకవితలో కథ కొందట్లోనే కంచికి పోయింది. అంతరంగాన్ని పరిష్వంగం చేసుకునే అతి చిన్నసున్నితమైన భావం సైతం కవితావస్తువై కూచుంది. భావకవులు సంప్రదాయంతో సాంతరాయం అట్టే చేయలేదుగాని కొత్తపు మోజు పడ్డారు. పద్యచ్ఛందస్సుల నాదరిస్తూనే గేయమాధుర్యానికి గంతులేశారు. గ్రాంథిక భాషలోని సౌందర్యాన్నీ సౌకుమార్యాన్నీ ఆరాధిస్తూనే వాడుక భాషలోని పోడిమిని పలికారు. అయితే చాదస్తులు వీరి కవిత్వపుటాంతర్యాన్ని అర్థంచేసుకోలేక వీరిమీద కత్తులు దూశారు. వీరు ఒరలు చూపెట్టారు. ఆ కత్తులు క్రమంగా దాక్కున్నాయి. అయితే వీరే తరువాత తరువాత అభావకవితలూ మహాభావకవితలూ చెప్పి పాఠకలోకానికి దూరంగాపోయి ప్రాయోపవేశాలు చేసుకున్నారు.

అసలిది యెంత ఆధునికయుగమనుకొన్నా మనదేశంలో మాత్రం ఆధునికత పులగంమీది పప్పులాగే వుంది కాని పాశ్చాత్యదేశాల్లోలాగ పరిపూర్ణవ్యక్తిత్వం కలిగివుండలేదు. ఒకవంక సంప్రదాయం పేరు కావలసినంత చాదస్తం చలామణీ అవుతున్నది. అయితే పాత గుర్రాలమీదే కొత్తజీనులు వేసుకుని స్వారీచేస్తున్న గడుసురౌతులు లేకపోలేదు. అంత సంప్రదాయాభిష్యుడనుకొన్న విశ్వనాథవారే –

'లేతబుర్రలు కొక్కిరిస్తే అతగాళ్ళతో
నేమిగానీ
తాతతాతలనాటి కథలూ తవ్విపోస్తా
నోయ్'

అన్నారేగాని కవిత్వంలో నవత్వాన్ని కాగలించుకోకతప్పలేదు. అసలా 'లేతబుర్రలు కొక్కిరిస్తే' అన్న పంక్తులేమిటి? ముత్యాలసరం బాణీ కాదూ! ఆ భాష వ్యావహారికం బాపతు కాదూ! 'తాత తాతలనాటి కథలూ తవ్విపోస్తానోయ్' అని అన్నారు కాని ఆ ప్రతిజ్ఞ చేసిన వారి కృతి 'కోయిలమ్మ పెళ్ళి' కొత్తకథా పాతకథా? వెనకటి ఆంధ్ర కవితా పితామహులూ, కవిసార్వభౌములూ, కవిబ్రహ్మలూ మచ్చుకిలాంటి కావ్యంగాని, కథగాని వ్రాశారా? విశ్వనాథ వారి వీరమతం రామాయణ కల్పవృక్షంలోనే కదిలిపోయింది. ఆ ఛందస్సూనూ ఆ గ్రాంథిక భాషనూ ఆ కథనూ ఆ పాత్రలనూ చూసి అంతా యేదో పాతచింతకాయ పచ్చడి అనుకొంటాం గాని అందులో ఎక్కడపడితే అక్కడ విశ్వరూపం ధరించిన విశ్వనాథ కవితాశిల్పంలో వున్నంత నవ్యత యే ఆధ్యతన కావ్యంలో వున్నది? ఒక్క దృక్పథంలోనే ఆయన సంప్రదాయపు మనిషి కాని కవిత్వంలో పరమనవ్యుడు. ప్రతిభ యొక్క స్వభావ జీవలక్షణమే నవ్యత్వవిస్ఫూర్తి. ఆయన ప్రతిభాసముద్రుడు కాబట్టే అంత నవ్యతను ప్రదర్శించగలిగాడు. కవితాశిల్పంలో నవ్యత్వానికి దృక్పథంలో సంప్రదాయానికి కంకణం కట్టాడు.

అసలు నవ్యత్వం పేరిట మనం పాశ్చాత్యదేశాల నుండి వాళ్ళ అవలక్షణాలను కావలసినంత కాపీచేసుకొన్నాం. మన తలకుమించిన మంచిని మానేశాం. జీవితంలోనూ అదే జరిగింది. సాహిత్యంలోనూ అదే జరిగింది. తరుచుగా తరతరాలుగా పరస్పరం కక్షలతో కావేషాలతో కత్తులు దూసుకుంటూ స్తిమితచిత్తత కోల్పోయిన పాశ్చాత్యజాతులు కలతనిదురలో చేసిన ప్రలాపాల వంటి అనేక 'ఇజాలు' కొన్ని మన సాహిత్యంలోనికి కూడ దిగుమతి అయినా నిజానికి అబ్బురమూ నిబ్బరమూ అయిన సంప్రదాయబలం గల మనజాతిలో అవి నిలద్రొక్కుకొని వుండలేకపోయాయి.

'హాష్! హూష్! హూష్ హాష్ అని
కేకలువేసి
కావ్ కావ్! మ్యావ్ మ్యావ్ అందాం
గమ్మత్తుగా
న...న....న....న... న త్రిమాటలుకూడా
మ...మ...మ . మ... మనవ్రాతల్లో
వుండొచ్చు'

అని దాదాయిజ్మ్ కైవాడంలో మన శ్రీశ్రీ ఎంత డాబుసరిగా అన్నప్పటికీ-

'జీబ్రాకీ ఆల్ జీబ్రా చిహ్నాల
లాంకోటూ సా. కోస్యా తొడిగి
సాహిత్య పౌరోహిత్యం యిస్తే
వెర్రికాదు వ్రణయలింజరా సోదరా!

అని ఆ సిరిసిరిమువ్వ అధివాస్తవికత పేర ఎంత అట్టహాసం చేసినప్పటికీ ఆ ధోరణులకు ఆయనే స్వస్తి చెప్పాడు కాబట్టి మనకు దగ్గరగా నిలబడగలిగాడు. ఆయన చేసిన ఆ బాలకాలపు స్థితిగతులు లేకపోయాయి గాని సమకాలిక పరిస్థితినీ సమాజపు చైతన్యాన్నీ గమనించి సామ్యవాదదృక్పథంతో అభ్యుదయ కవితావతారం ఎత్తేడు. అది కొంతకాలం కాలూపు కండబలం గలది కాబట్టి వేరు తన్ని నిలబడుతున్నది.

ప్రాధాన్యవివక్షయా చూస్తే ఆది నుంచీయూ పాశ్చాత్యదేశాలలో సాహిత్యంపై సమాజప్రభావ మెక్కువ. మన దేశంలో సమాజంపై సాహిత్యప్రభావ మెక్కువ. అందుకే క్రమంగా నలువాడలా అలముకుంటోంది అభ్యుదయకామన, భావన. అందుకే_

ఏదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వ
కారణం
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన
పరాయణత్వం
నరజాతి చరిత్ర సమస్తం పరస్పరాహ
రణోద్యోగం
నరజాతి చరిత్ర సమస్తం దరిద్రులను
కాల్చుకుతినడం

అని ఒక్క గుక్కలో నేను అభ్యుదయ కవిత్వానికి పుట్టినిల్లయిన సోవియట్ దేశంలో లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో శ్రీశ్రీ 'దేశచరిత్రలు' గేయాన్ని సావేశంగా గానంచేసి అనువదిస్తూవున్నప్పుడు ఆ హితబోధ ఇంక వారికక్కర లేకపోయినా ఆ సమాజం సమాజమంతా పరవశించిపోయింది. అయితే శ్రీశ్రీ సహజంగా సరుకున్నవాడూ సంస్కారబలం గలవాడు కాబట్టి వటవృక్షంలా పెరిగిపోయాడు. అతని ధోరణి నాశ్రయించి అతనిలా శబ్దార్థాల్లో అఖండశక్తిపాతం చేయలేక ఆ బెలుకులూ నగిషీలు చెక్కలేక అంత సంస్కారం లేక అతని సామ్యవాద దృక్పథమూ, ఆ సంప్రదాయ సాంపరాయమూ, ఆ నియమ నిరసనమూ, ఆ విశృంఖల విహారమూ అదే చూసుకుని అదే కవిత్వమనుకొని ఆ మర్రినీడలో ఎన్నో క్షుద్ర మొక్కలు పెరుగుదల లేక గిడసబారి పోయాయి. ఆయన గడుసువాడు _ వారిచేత చెక్కభజన చేయించుకుంటాడు గాని వాళ్ళకసలు కిటుకులు చెప్పడు. ఉపరి సెభాషంటూ వెన్ను తడతాడు. అందుకే మరీ యిటీవలికాలంలో మన కవిత్వంలో అవ్యవస్థ యెక్కువైపోయింది.

తొలినాళుల పద్యార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి,
ఈనా
టుల వ్రాసిన కవిదోషము
కలిగడచినకొలది చిత్రగతులను
పడయున్

అన్నాడొక పెద్దాయన. ఈనాడు దేశకవులా దోషానికి పాల్పడటాని కిష్టంలేక చిత్రగతుల్లో నడుస్తున్నారు. కవిత్వానికి ఛందస్సక్కరలేదు. అలంకార మక్కరలేదు, భాష ఎవరికి వచ్చినది వారిది, ఎవరికి నచ్చినది వారిది, అసలు కవిత్వమే అక్కరలేదు సామ్యవాద దృక్పథం వుంటేచాలు అన్నంతవరకు వస్తోంది అనుసారుల ధోరణి. అల్పసంతోషులైన పాఠకులు కూడ అదే కాబోలు కవిత్వమనుకుంటున్నారు. అసలు ఛందస్సు పొందలైనంత కవిత్వమని ఏ ప్రాజ్ఞుడూ అనుకోడు గాని అది కవిత్వానికి చేసే పోషణక్కూడ ఏ ప్రాజ్ఞుడూ కాదనలేడు. ఒక్క పద్యం వ్రాయకపోయినా కాదంబరి వ్రాసిన బాణభట్టు మహాకవి కాడనేవాడూ లేడూ. వచన కవిత్వమైనా వ్రాస్తే అలా వ్రాయాలి పకడ్బందుగా ఒక లయ హుషారుతో కదుష్ణమధుర భావసంపదతో అపూర్వభావ వ్యక్తీకరణ శక్తితో. రిల్క్ ప్రభృతుల కృతుల్లో కావలసినంత కవిత్వం వుంది, సమకాలిక సమాజ సంక్షేమదృష్టి వున్నది. ఇటీవల గుంటూరు శేషేంద్రశర్మగారొకరు సంప్రదాయపు పునాదిమీద సంస్కారపు పడగెత్తి సాధుమేధాసహాస్ర ధారతో పగడగా కవిత్వం చెబుతున్నారు. అన్ని మార్గాలూ వశంవదం చేసుకుని ఇటీవల వచనాన్ని వచనం చేస్తున్నారు. ఆయన మరీను. వ్యాసాలు వ్రాసేస్తారు. అందులో కవిత్వాన్ని వాసన చూసుకోమంటారు. పరమ రమణీయమైన శిల్పమూ, భావసంపదగల కవిత్వపు ఖజానాలు ఆయన వ్రాసిన 'మండే సూర్యుడు', 'నాదేశమూ నా ప్రజలూ'. కాని ఎంత రాటీధోరణి సహృదయుడికైనా కావ్యం చదివినట్లు చదవాలనే ప్రలోచనగాని కడదాక ఎడబెట్టకుండా కమ్మగా చదువుకపోవాలని గాని అనిపించడం కష్టం. అయితే ఆ భావచిత్రా అపూర్వం, ఒక వంక విప్లవధోరణిలో పడి శ్రీశ్రీ ప్రభృతులు కవిత్వం ప్రతి జట్కావాలాకి అర్థం కావాలని సంకల్పం చెప్పుకుంటూవుంటే శేషేంద్రశర్మగారు తన కవిత్వం వలువరికి అందుబాటులో వుండాలనే సదుద్దేశంతోనే తన కవితకు 'జనతా' వాలకం వేశారుగాని సామాన్యులకే గాదు ధీమాన్యులకు గూడ ఒక పట్టాన అర్థం కాకుండా చేశారు.

అటు పాశ్చాత్యదేశాల్లోని బీటిల్స్, ఏంగ్రీయంగ్మెన్ లాగు మనకూ మరో తరహా కవులు బయలుదేరా రిటీవల_ నవ్యాతినవ్యులు దిగంబరులు. ప్రతిఘటన వారు అంటూ 'అపోజిట్ కాంప్'లో వారు గూడ వీరిని ఆదరించడం జరుగుతున్నది అయితే వీరిధోరణి మరీ విశృంఖల వీరవిహారం. సంప్రదాయం లేకపోతే

ప్రాచీన సాహిత్యామృతం :

# 2. ధూర్జటి భక్తితత్త్వం, కవిత్వం

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

అష్టదిగ్గజాలలో సముచిత స్థానాన్ని అలంకరించిన ధూర్జటి తన కృతుల మాధుర్యంతో ఆంధ్రవాఙ్మయంలో అపూర్వ స్థానాన్ని ఆక్రమించారు. 'స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో అతులిత మాధురీ మహిమ?' అని రాయల వారు ఆశ్చర్యపడ్డారంటే, దాన్నిబట్టి అష్టదిగ్గజాల్లో ధూర్జటికెలాంటి గౌరవం లభించిందో స్పష్టమవుతుంది.

ధూర్జటి ఎన్ని కృతులు రచించారో కానీ, మనకు లభిస్తున్నవి రెండే రెండు. ఆ రెండూ కూడా కాళహస్తీశ్వరునికి సంబంధించినవే! మొదటిది కాళహస్తి మాహాత్మ్యము అనే ప్రబంధం. రెండోది శ్రీకాళహస్తీశ్వర శతకం అనే భక్తివైరాగ్య భావాల శతకం. కాళహస్తి మాహాత్మ్యం నాలుగాశ్వాసాల ప్రబంధం. శివోపాసన చేసి ముక్తి పొందిన వారి కథలీ ప్రబంధంలో వర్ణింపబడ్డాయి. వసిష్ఠుడు, బ్రహ్మదేవుడు, సాలెపురుగు, పాము, ఏనుగు, బోయవాడు, నత్కీరుడనే కవి, వేశ్యకన్యలిద్దరు, యాదవరాజులు ఇలా శివభక్తివల్ల ముక్తిపొందినవారే! శివుని అనుగ్రహానికి భక్తులంతా పాత్రులే అని చెప్పదలచాడు ధూర్జటి.

వసిష్ఠునికి ముక్తినివ్వడం కోసం శివుడు కాళహస్తి క్షేత్రంలో జ్ఞానప్రసూనాంబికా సమేతుడై అవతరించడం మొదటికథ. కాళహస్తి దక్షిణ కైలాసంగా ప్రసిద్ధి పొందింది.

పుత్రహత్య దోషాన్ని పోగొట్టుకోవడానికి బ్రహ్మదేవుడు కాళహస్తి కరుదెంచి, సువర్ణ ముఖరిలో స్నానం చేయడం రెండోకథ.

శ్రీ అనే సాలెపురుగు శివుణ్ని తన నోటి నూలితో ఆరాధించి, శివుని పరీక్షకు తట్టుకుని, ముక్తి నందిన కథ మూడవది.

సర్పమైన కాళము, ఏనుగైన హస్తియు ఒకదాన్ని మించి ఒకటి శివుణ్ని పూజించి, ఆత్మార్పణం గావించి, ముక్తి పొందుట నాలుగవ కథ.

శివునితోనే యుద్ధము చేసిన అర్జునుడు కిరాతుడైన తిన్నడుగాపుట్టి, మూఢభక్తితో శివునారాధించి, అతనికి తన నేత్రమర్పించి, కన్నప్ప అయిన కథ అయిదవది.

పాండ్య రాజాస్థానకవి అయిన నత్కీరుడు శివుని పద్యమునందే తప్పుపట్టి, అతనిచే శపింపబడి, కాళహస్తికి వచ్చి, ఆ శాపం నుంచి విముక్తి నొందడం ఆరవకథ.

వేశ్యకు జన్మించినా, శివభక్తురాండ్రై, కాళహస్తి చేరడానికి ఎన్నో కష్టాలు పొంది, శివుని దయవల్ల అక్కడికి చేరిన వేశ్యాతనయల కథ ఏడవది.

కపట జంగమరూపంలో ఒక రాజదాసి యింట ఆతిథ్యం స్వీకరించి, ఆమెతో క్రీడించి, శివుడు తన మహిమలతో ఆమెను రాజాగ్రహంనుంచి తప్పించి, తనకు కాళహస్తిలో ఆలయం నిర్మింప జేసుకున్న కథ ఎనిమిదవది.

ఈ కథలను ప్రబంధ రీతిలో వర్ణించిన ధూర్జటి పరమేశ్వరానుగ్రహానికి భక్తి ఒక్కటే హేతువని సందేశమివ్వ దలచినట్లు కనిపిస్తుంది. భక్తుడు తన సమస్తాన్నీ భగవంతుడికి అర్పించడంలో దోషంలేదు. దీనినే ఇష్టదాన వ్రతం అంటారు.

ప్రబంధ కవులతివర్ణనలకు పేరు పొందారు. కాని ధూర్జటి వర్ణనలు క్లుప్తంగానూ మనోరంజకంగానూ ఉంటాయి. సముద్రవర్ణన, సూర్యాస్తమయం, సూర్యోదయం, చంద్రబింబం, వెన్నెల, మర్రిచెట్టు, మాయాకిరాతుడు, వంటి వర్ణనలిందుకు నిదర్శనాలు.

ధూర్జటి ఆత్మీయతనీ, సత్యావగాహననీ ఈ క్రింది పద్యం అద్దంలా చూపిస్తుంది.

ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమో
  త్ప్రేక్ష ధ్వనివ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన
  నీ రూపమున్
జాలండాలు గవిత్వముల్ నిలుచునే
  సత్యంబు వర్ణించుచో,
ఛీ! లజ్జింపరుగాక మాదృశకవుల్
  శ్రీకాళహస్తీశ్వరా!

ధన విముఖత, భక్తి బద్ధ జీవనం, వాంఛా విరక్తి, రాజసేవా తిరస్కారం, వంటి గుణాలు అనుభవం వల్ల ధూర్జటి కందివచ్చాయి. ఆధ్యాత్మిక విచారం వైపు అతన్ని నడిపించాయి. ఆయన శతకం శతకవాఙ్మయానికే ఒక తలమానికం వంటిది.

పోసిపోయి కాని మరీ సభ్యత, మర్యాద తెలిసి తే ఎలా ధరించగలం? కవిత్వమంతా ఒక మూసలో పోసిన పోతబొమ్మలా వుండాలని కాదు నా వుద్దేశ్యం. సృష్టి సూత్రాల్లోనే వైవిధ్యమొకటి. 'భిన్న రుచిర్హి లోకః' అన్నది పరమ సత్యం. ఆ సత్యం చావనంత కాలం అన్నిరకాల కవిత్వాలూ వుండవలసిందే. అయితే ఒక సాహిత్య స్వతంత్రుడిగా నేను సూచించగల మార్గమేమంటే—

కవితా తురంగానికి కమ్చీ నవీనత
  కళ్ళెం సంప్రదాయం
లేక మరోలా అంటాను
 సింధుజము నవకవిత
 సింధురము సంప్రదాయకవిత
 వాహ్యాళి కది, ఊరేగింపు కిది.

నందికొటుకూరి సిద్ధయోగి కృత

# 3. నవపద్యపుష్పమాలిక

— శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

పదైనిమిదవ శతాబ్దమున రచింపబడి ఇంత వరకు లిఖిత ప్రతులలో మరుగునపడి యుండిన నవపద్యపుష్పమాలిక ప్రప్రథమముగ 'సమాలోచన' ద్వార ప్రస్తుతము ప్రచురితమగు చున్నది. ఈ పద్యములను రచించిన నందికొటుకూరి సిద్ధయోగిని గురించి ముందుగ సంక్షిప్తముగ తెలిసి కొందము.

I కవిపేరు : నందికొటుకూరి సిద్ధయోగి.

II కవి ఇతర వ్యవహారనామములు : సిద్ధయ, సిద్ధప్ప, సిద్ధలింగకవి, సిద్ధయోగీశ్వర, సిద్ధరామ శివయోగి.

III కులము : వీరమహేశ్వర (జంగము), నంది కొటుకూరి సిద్ధయోగియు పోతులూరి వీరబ్రహ్మంగారి శిష్యుడగు దూదేకుల సిద్ధయ్యయు అభిన్నులని కొందరు పరిశోధకులు Ph.D. పరిశోధనా సిద్ధాంత గ్రంథములలో సైతము వ్రాసిరి. అది పొరపాటు. వీరిరువురును భిన్నవ్యక్తులని నిరూపించు ఆధారము లనేకములు కలవు. (ప్రస్తుత మిక్కడ తద్విషయమును విపులీకరించి చర్చించినచో శాఖాచంక్రమణమగును. కనుక ప్రత్యేకమగు వేరొక వ్యాసమున నంది కొట్కూరి సిద్ధయ దూదేకుల సిద్ధయ్యలను గురించి చర్చించి వారు భిన్న వ్యక్తులని నిరూపింపబడును.)

IV జన్మస్థలము : కర్నూలు జిల్లాలోని నందికొట్కూరు.

V కాలము : పద్దెనిమిదవ శతాబ్దము చివరి మూడు పాదములు. జీవితకాలము రమారమి డెబ్బదిసంవత్సరములు.

VI కవిసంతానము : పుత్రుడు - శంకరయ్య పుత్రిక-లంబమ్మ శంకరయ్య కూడ తండ్రివలె మహితచరితుడు. అతడును తండ్రి వలెయోగిపుంగవుడేకాక కవిపుంగవుడు కూడ. అతడు శంకరశతకము, స్వానుభూతి విలాసమనెడి క్రీడ రచించినట్లు తెలియుచున్నది.

VII గురువు: అలంపూరు వాస్తవ్యుడగు గడిగెదిక్కయ్య. అలంపూరు బాల్బ్రహ్మేశ్వరాలయమున సిద్ధయోగి తనగురువుచే బ్రహ్మోపదేశమును పొందెను.

VIII శిష్యులు: భట్టు అయ్యప్ప (నందికొట్కూరు), శేషయ్య (సుల్తాన్ పురము - అలంపూరు తాలూక), చెన్నయ్య దాసు (మిడుతూరు - నంది కొట్కూరు తాలూక) బ్రాజత్థానుమియ్య (కందనవోలు).

IX రచనలు :

1. యోగీశ్వర విలాసము. ఇది మూడు ఆశ్వాసముల ద్విపద కావ్యము. ఈ కృతికి శ్రోత బ్రాజత్థానుమియ్య. శైవవాఙ్మయములో ప్రసిద్ధుడయిన అల్లమప్రభువు అక్కమహాదేవికి శివయోగ సంప్రదాయములు బోధించుట ఇందలి ప్రధానేతి వృత్తము. దీని లిఖిత ప్రతులు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము (మద్రాసు) లో రెండుకలవు. అందొకటి కాగితపు ప్రతి (డి. నెం. 1178), మరొకటి తాళపత్రప్రతి (డి. నెం. 1179). దీని మరొక లిఖితప్రతి నందికొట్కూరు వాస్తవ్యులు భాష్యాంతవైయాకరణులునగు పీల కంఠశాస్త్రిగారు పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి కిచ్చిరట. ఆంధ్ర సాహిత్య పరిషత్ గ్రంథాలయము (కాకినాడ) కొరకు పెండ్యాలగారు సేకరించిన లిఖితప్రతి పరిషత్ గ్రంథాలయములో నున్నదేమో చూడవలసి యున్నది. ఈ కృతి ప్రాచ్య లిఖిత గ్రంథాలయము (మద్రాసు) వారి పత్రికలో ప్రచురితమైనది కూడ. తత్పరిష్కర్తలు మల్లంపల్లి శరభయ్య, తీర్థం శ్రీధర మూర్తిగారలు.

2. వేదాంతసూత్రములు : ఇది బ్రహ్మలింగాంకితముగ సీసపద్యములలో చెప్పబడిన గ్రంథము. దీని కాగితలిఖితప్రతులు ప్రాచ్య లిఖిత గ్రంథాలయము (హైదరాబాదు)లో మూడు కలవు. అందొకటి అసమగ్రము (నెం. 3859), కదమ రెండును సమగ్రము (నెం. 3865, నెం. 3847).

3. షట్స్థల దర్పణము : దీని లిఖిత ప్రతులు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము (హైదరాబాదు)లో మూడుకలవు. నెం. 4008

---

ఈ ప్రపంచమంతా ధూర్జటికి 'శివమయం' గానే కనిపించింది. భావనని బట్టి కవికి దర్శనం (Vision) మారుతూ ఉంటుంది. ఆ భావనకి మూలం అతనికి జ్ఞానం వల్ల అబ్బిన సంస్కారం. ఇక్కడే కవి ఆత్మీయతని మనం పట్టేసుకోగలం. చూడండి ధూర్జటి కవిత్వ నిజస్వభావం -

ఈ క్రింది పద్యంలో -

'ఉదయాగ్రావము పానవట్ట
మభిషేకోద ప్రవాహంబు వార్ధి
దర ధ్వాంతము
ధూప ధూమము
జ్వలద్దీప ప్రభారాజి కౌముది
తారానివహంబు లర్పిత సుమంబుల్
గా
తమోహార సౌఖ్యదమై
శితగభస్తి బింబ శివలింగం
బొప్పె
ప్రాచీదిశన్.''

చంద్రుడిలో కూడా శివుడ్నే చూడగలిగాడు ధూర్జటి. కాదు కాదు, మనకు కూడా చూపించగలిగాడు. అక్కడే ఉంటుంది కవి కృతార్థత.

కాగితప్రతి సమగ్రము. నెం. 3846 కాగితప్రతి సమగ్రము. నెం. 3860 కాగిత ప్రతి అసమగ్రము.

4. కీర్తనలు (లింగదేహ విచారణ): దీని సమగ్ర కాగిత లిఖితప్రతి ప్రాచ్య లిఖిత గ్రంథాలయములో కలదు. నెం. 3861

5. తత్వములు : ఒకటి రెండు మాత్రము లభ్యములు, ఇంకను పెక్కు కలవని వినికిడి. ప్రయత్నించిన లభింపగలవేమో।

6. పంచరత్నములు : ఇవి 'శిష్య హృదయాబ్జభృంగశ్రీసిద్ధలింగ' అనెడి మకుటమును కలిగియున్నవి. ఈ పద్యములు గద్వాల చిన సోమభూపాలుని విద్యదాస్థానమున చెప్పినట్లు తెలియుచున్నది. ప్రస్తుతము ప్రచురింపబడిన నవపద్య పుష్పమాలికకు మాతృక అయిన కాగిత లిఖితప్రతిలో ఈ పద్యములు కలవు. విశ్వంత నూగూరార్యులు రచించిన 'మహనీయుల చరిత్ర' అనెడి గ్రంథమున ఈ పంచరత్నములు ముద్రితము. (1968)

7. నవపద్య పుష్పమాలిక : (ఇవి ప్రస్తుత ప్రచురిత పద్యములు) దీని కాగిత లిఖిత ప్రతులు సమగ్రముగ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము (హైదరాబాదు) లో రెండు కలవు. నెం. 3847, నెం. 3814. దీని మరొక లిఖితప్రతి కర్నూలులో మఠం వీధి వాస్తవ్యులగు వీరమహేశ్వరుల (జంగము వారి) చెంతలభించినది. ఈ ప్రతియే ప్రస్తుత పద్య ప్రచురణకు మాతృక.

CNB : పైన పేర్కొన్న ప్రాచ్యలిఖిత గ్రంథాలయములందలి ప్రతుల వివరములు ఆయా గ్రంథాలయాలు ప్రచురించిన కేటలాగులనుండి గ్రహింపబడినవి)

X ఇతర వివరములు : నందికొటుకూరి సిద్ధయోగి ఒక మహనీయుడు. ఈ సిద్ధపురుషుని మహితచరితమును కర్నూలు సమీపమునగల చిన్నటేకూరు వాస్తవ్యుడును వీరమహేశ్వరుడును (జంగమువారును) కవి పండిత పరిశోధకుడును అగు కీ. శే. విశ్వంత నూగూరార్యులు 'మహనీయులచరిత్ర' అనెడి గ్రంథమున (పుటలు 11-20) రచించిరి. మచ్చునకు సిద్ధయోగి మహిమాభి వర్ణనాత్మకమగు పద్య మొకటి –

ఎదురైన పులిపోర నేకాంతమునుదెల్పి
మరలించిపోయిన మాన్యుడెవడు
అది గర్భదాన మయినపు భార్యతో
జనియించు శంకరుండనియెనెవడు
మాతంగ భక్తుని మందిరంబున విందు
భుజకమై గైకొన్న భవ్యుడెవడు
ఖండిత శిరమై యుండిన మహిషంబు
కాల్దన్ని బ్రతికించె ఘనుడెవండు
భక్తులార్చు దంపతికిని ముక్కంటి
పాపడై భోదకుడై పరుడెవండు
రామళ్ళకోట మారముమగాల పురద్వ
యంబున నొకవేళ నడరెనెవడు
అన్నింట దా నిండి యున్నట్టిదృశ్యంబు
గద్వాల నగమునే జ్ఞాని చూపె
ఎలమి నెదజీల్చి లింగంబు నెవడు చూపె
మానవుల నగ్నిపిడ గందనోల్న వాడు
చలన మింతయు లేకున్న స్వామియతడె
నందికొటుకూరి సిద్ధయోగీంద్ర మౌని.

కర్నూలు సమీపమున గల తడకనపల్లెలో సమాధి జెందిన 'కరిరామయోగి' అను మహనీయుడు నందికొటుకూరి సిద్ధయోగి కృతులను కొన్నిటననుసరించుచు యోగీశ్వరవిలాసము, వేదాంత సూత్రము, పంచరత్నములు, షట్స్థల దర్పణము, నవపద్య పుష్పమాలికలు రచించినట్లు తెలియుచున్నది. కవి రామయోగి రచించిన నవపద్య పుష్పమాలికలో మకుటము 'నవ్యధవళాంగ శ్రీమహానందిలింగ' అని కలదు.

'నందికొటుకూరిసిద్ధయోగి కృతులు – పరిశీలన' అనెడి అంశముపై గవేషణచేసి జిజ్ఞాసువులెవరైన పరిశోధనాత్మక సిద్ధాంత గ్రంథరచనకు బూనుకొనినచో మరి కొన్ని విషయములు వెలుగునకు రాగలవు.

నందికొటుకూరిసిద్ధయోగి ఆధ్యాత్మికతను వీరశైవనిష్ఠాగరిష్ఠతను ప్రతిబింబింపజేయు ఆ మహనీయుని 'నవపద్యపుష్పమాలిక'ను ఇక చిత్తగించండి –

—: నవపద్యపుష్పమాలిక :—

శ్రీమన్మహారాజ శివయోగ హృదయుల
కే వస్తు విచ్చు విశిష్ట సిద్ధి
సొరిది జాగ్రత్స్వప్న సుప్తులలోన నే
వస్తువు వెల్గు ప్రశస్త మగుచు
నబ్జజాది పిపీలికాంత శరీరంబు
లందు నేవస్తువు బొంది తనరు
పటుతర బ్రహ్మాండ భాండంబులన్ని ని
ర్మించి యే వస్తువు మ్రింగు చుండు
నట్టి వస్తువ నీవని యభినుతించి
శీల నవపద్య పుష్ప మాలికలు గూర్చి
యర్చనము సేతు విన్ను లింగాంగమతుల
జేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ। 1
త్రివిధంబులై యుండు శ్రీరాజయోగంబు
ప్రకటిత సాంఖ్య తారకము లరయ
నమనస్కమన నిర్వద్దైదు తత్త్వము లెంత
నేర్చిన సాంఖ్యంబు నీరు మధ్య
దీపంబు ధ్యానించి తీరుట తారకం
బగు పరమాత్మ తా నని యెరింగి
ధ్యాన శూన్యంబైన తన్మయ మమనస్క
మన జెల్లునిది దేశికాత్మవలన
శ్రవణ మనన విధి ధ్యాన సాధనముల
తెలిసి కృతకృత్యులైనట్టి ధీరనుతుల
ననుభవ జ్ఞానరతుల లింగాంగమతుల
జేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 2
ఇష్టలింగమునకు దృష్టంబుగా మూడు
ప్రాణలింగమునకు ప్రథిత రెండు
భావలింగమునకు భావింపనొక్కటి
యై యొప్పుచుండు నెల్లవిన మరియు

భువన బిందునాద చిత్కళయుక్తలింగంబు
  కళానాద చిత్కళల్ ప్రాణలింగ
మగు చిత్కళారూప మహాభావలింగంబు
  కారణాభాస్య నిక్కముగ జేసి
యిట్టి లింగ రహస్యంబుల్ దిట్టముగను
  శాస్త్ర సమ్మతి నాత్మ నిశ్చయముజేసి
నట్టి శివయోగి సుఖిత లింగాంగమతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 3

భువి బాహ్యముఖమున శివలింగమూర్తికి
  ప్రతిత వర్ణంబు లర్పణము జేసి
స్పర్శనాననమున చరలింగమూర్తికి
  స్పర్శ సుఖంబు లర్పణము జేసి
సత్వ దాస్యమున ప్రసాదలింగమునకు
  భవ్య శబ్దంబు లర్పణము జేసి
యాత్మ వక్త్రమున మహాలింగమూర్తికి
  పరిణామచయము లర్పణముజేసి
యాదిత స్థూలమున దిష్టలింగమునకు
  భద్ర రూపంబు లర్పణముజేసి
రమణ సూక్ష్మంబున ప్రాణలింగమునకు
  పటుతర సురుచులర్పణము జేసి
పరమ కారణమున భావలింగమునకు
  భావిత తృప్తు లర్పణముజేసి
నవముఖంబులలోన నవవస్తు సంతతుల్
  నవవిధ లింగార్పణములు జేసి
జీవగుణంబు వర్జించి లింగగుణంబు
  భావంబులోపల పట్టు గొల్పి
లింగాంగ సంయోగ సంగతి నైక్యమై
  రతి నవస్థాత్రయ భ్రాంతు లుడిగి
చెలిగి విశ్వేష్టితావస్థనొంది యావ్య
మొంది చరియించు సచ్చిదానంద రతుల
సతుల తత్త్వైక గతుల లింగాంగమతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 4

మూడుదేహములందు మొలసియున్నమలంబు
  లను మూడు దీక్షల చనగ ద్రోలి
యలర నా దేహత్రయములందు మూడు లిం
  గములుంచి యుభయమేకముగ జేసి
యైక్యాది భక్తాంతమైన స్థలంబుల
  పదకలు వేర్వేరు పరుప నేర్చ
యంగ హస్తంబులు లింగముఖంబులు
  భక్తి శక్తులు సమర్పణము తెరిగి
చతుర సకలాంగముల లింగ సరణిగూర్చి
యుగ్ని కర్పూర సంయోగమైన భాతి
నైక్యమై యున్న యట్టి లింగాంగమతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 5

లింగ నాసికమున లెస్స వాసనలాని
  లింగ జిహ్వబుజించి లీలదనరి
లింగనేత్రముల నుప్పొంగిచూపుల జూచి
  లింగదేహంబున వంగ మంటి
లింగశ్రుతుల సల్లలిత శబ్దముల్ విని
  నలి లింగతృప్తి నానంద మొంది
లింగజాగ్రమున నెరింగి సర్వము చేసి
  లింగ నిద్రను తాము లీనమగుచు
తగిలి సకలంబు లింగమై తమ్ము మరచి
యుల్లసిల్లెడి షల్లింగ యోగహితుల
నమిత సద్గుణ యుతుల లింగాంగమతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 6

త్వం పదంబిష్టంబు తత్పదమే ప్రాణ
  మసి పదంబగు భావ మరసి చూడ
చిద్రూప మిష్టంబు సద్రూపు ప్రాణంబు
  నానంద రూపు భావాఖ్యమగుచు
బిందు విష్టంబగు పేర్మినాదము ప్రాణ
  మగు కళయే భావమనగ నొప్పు
అంగమే యిష్టంబు లింగమే ప్రాణంబు
  సయ్యోగమే భావమయ్యె తెలియ
వీట్టి పరమ రహస్యంబు నెరిగి గురు ము
ఖాంతరంబున నుపదేశమందినట్టి
యుక్తుల సంశయహతుల లింగాంగమతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 7

చతురత జాగ్రమాచార లింగంబయ్యె
  స్వప్నంబు గురులింగ సదనమయ్యె
సవిశేషముగ సుప్తి శివలింగతనువయ్యె
  లీల తుర్యముచరలింగమయ్యె
తమ పతీతంబు ప్రసాదలింగంబయ్యె
  నిరవస్థ ఘనలింగ నిలయ మయ్యె
మరియు జాగ్రత్స్వప్న మమతవిష్టంబయ్యె
  రతి సుప్తి తుర్యముల్ ప్రాణ మయ్యె
అత పతీతంబు నిరవస్థ సరణి భావ
మయ్యె నని చూచి దేహమోహంబుడిగి
నట్టి మోక్షాధిపతుల లింగాంగమతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 8

దేహంబు శివలింగ దేహమై శోభిల్ల
  దేహ మేవనెడి సందేహమేది
హృదయంబు శివలింగ హృదయమై రాజిల్ల
  హృదయ మేవనెడి మైత్రృత్వమేది
భావంబు శివలింగ భావమై భాసిల్ల
  భావ మేననెడి స్వభావ మేది
జీవంబు శివలింగ జీవమై విలసిల్ల
  జీవ మేవనెడి విశేషమేది
యుర్వి సర్వంబు లింగమై యుల్లసిల్ల
నితరమేది ద్వైతభ్యంల కెంచి చూత
నమచు చింతించినట్టి లింగాంగ మతుల
చేర్పవే నన్ను విమలాంగ సిద్ధలింగ! 9

ఈ పద్యంబులు శోభిల్లి
శ్రీ పరమేశ్వరుడు తానె చిరమతినమరన్
ప్రాపుగ భక్తుల బుద్ధులు
గాపాడగ సిద్ధలింగకవి రచియించెన్. 10

ఈ సీసంబుల భావము
శ్రీ సద్గురు జేరియడిగి సేవకులై య
భ్యాసగతి నెరిగినట్టి మ
హా సుమతుల కబ్బు మోక్షమంతట
                              ధరణిన్! 11

నందికొటుకూరు సిద్ధయ్యగారు చెప్పిన
నవ పద్య పుష్పమాలిక లు సంపూర్ణము.

...—....

# 4. సరస సాహిత్య సుగంధాలకు తావులు పుష్పలావికలు

— డాక్టర్ సి. సూర్యనారాయణ, M.A., Ph. D.

నవరసాల్లో శృంగారం రసరాజంగా భావించబడుతోంది. కావ్యానికి శృంగారం గానీ, వీరంగానీ అంగిరసంగా ఉండాలని నియమం. అంతేకాక చతుర్విధ పురుషార్థాల్లో కామం కూడా ఉంది. కామం జీవసహజం. జీవులకు ఆకలీ, దాహమూ ఎంత సహజమో కామంకూడా అంతే. కాగా శృంగారం జీవితంలోనూ, సాహిత్యంలోనూ కూడా ప్రముఖపాత్ర వహిస్తోందనేది స్పష్టం. మానవజీవితంలో శృంగారంలాగా, శృంగారంలో పువ్వులు ప్రధానపాత్ర వహిస్తాయి. (ఉద్దీపన కోసం) అందువల్లేనేమో మన ప్రబంధ కవులు పూలబజారునుంచే సరసాలు ప్రారంభించారు. నిజానికి పుష్పలావిక వర్ణన కావ్యంలో ఉండాలని ఏ ఆలంకారికుడూ నిబంధించలేదు. అష్టాదశ వర్ణనల్లో కూడా ఆమెకి స్థానంలేదు. అయినప్పటికీ ప్రబంధకవులు ఏకొందరో తప్ప అందరూ పుష్పలావిక వర్ణనచేసి వారి వారి సరదాలను తీర్చుకున్నారు. అదీ కూడా చాలా సరసంగా, నర్మగర్భంగా వర్ణించి, పూలబజారులో సరససాహిత్య సుగంధాల్ని విరజిమ్మారు. అవి ఆనాటి వారి సరసశృంగార తత్త్వానికీ, విలాసమయ జీవితానికీ మచ్చుతునకలు.

పుష్పలావిక అంటే పూలమ్మే స్త్రీ అని అర్థం. ప్రస్తుతకాలంలో పూలమ్మేది ఎవరైనా, ఆనాడు మాత్రం స్త్రీలే అమ్మేవారు. పూలకీ 'కొమ్మ'లకీ అవినాభావ సంబంధం. పూలూ స్త్రీలూ కూడా కోమలాలే కదా! పూలు అమ్మేది స్త్రీలయినా కొనేది మాత్రం పురుషులే. అలా కాకపోతే పూలబజారులో సరసాలకు తావుండదుమరి. ఆముక్తమాల్యదలోని ఈక్రిందిపద్యంవల్ల పురుషమాలాకారులనుండి పూలను గ్రహించడం దోషంగా భావించేవారని తెలుస్తోంది.

ఎన్నఁడుఁ గూర్తు నన్న విను మేమును
దాల్చిన మాల్యమిచ్చిన
ప్పిన్నది రంగమందయిన పెండిలి
సెప్పుము మున్నుగొంటి నే
నన్నన దండయొక్క మగవాడిడ నేనుఁ
దెలుంగు రాయడన్
గన్నడ రాయ యొక్కఁడునఁ గప్పు
ప్రియాపరిభుక్త భాక్కృతన్
1 ఆ 14 ప.

అని తెలుగురాయుడు కన్నడరాయని కోరతాడు. కృష్ణావతారంలో సుదాముడనే మాలాకారుని నుండి కృష్ణుడు పూవులను గ్రహిస్తాడు. ఆదోష పరిహారంకోసం ఆముక్తమాల్యద కథను చెప్పుమని కలలో కన్పించి చెప్తాడు.

ఇక పుష్పలావిక వర్ణనలో పూలబేరాలకు సంబంధించిన అర్థం, శృంగారానికి సంబంధించిన అర్థం రెండూ ఉంటాయి. స్త్రీల అంగాలని పుష్పాలలో ఉపమించడం కవితా సమయం. ఒక్కొక్క అంగానికి ఒక్కో పువ్వు ఉపమానంగా రూఢిఅయింది, పుష్పలావిక వర్ణనచేసిన మొదటికవి నన్నెచోడుడు.

వీథివీథులఁ బుష్పలావికలు గలయ
నొత్తిపట్టిన క్రొవ్విరి యొత్తులొప్ప
సతులపై నెలయు నవ్విట సమితి సేయ
మదను డేర్చిన యలరంప పాదులవోలె_
కు. సం. 8 ఆ 122 ప.

అని వీథివీథులలోనూ పుష్పలావికలుంచిన క్రొత్తపూలప్రోగుల్ని మొత్తుల్ని, మదను డేర్చియుంచిన పూవుటమ్ముల పాదులలో ఉపమించాడు. 'కుమారసంభవము' అర్వాచీన గ్రంథమని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి అభిప్రాయం. ఆతర్వాత ప్రబంధకవులకంటె ముందు పిల్లలమర్రి పినవీరన 'శృంగార శాకుంతలము'లో పుష్పలావిక వర్ణనచేశాడు.

వెలఁ దగం బ్రసూనములు వేడుచు
మార్వురికింప నెత్తులం
గలసి చిగుళ్ళు పెట్టి యడకట్టిన
క్రొవ్విరి మొల్లపూవు టె
త్తుల దశనాధర ద్యుతులఁ దోచినఁ
బైకొసరీవిగా విటు
ల్వెలువగ వారిచిత్తములు విల్తురు
తత్పురి పుష్పలావికల్ -1ఆ 88 ప.

అని కవే అక్కడి పుష్పలావికల దగ్గర విటులు కొసరకొసరి ఎలా పూలను కొంటారో చెప్పాడు. అయితే ఆతర్వాత పుష్పలావిక వర్ణన చేసిన కవులు మరి కొంత ముందుకుపోయి వాక్యోపవాక్యాల ద్వారా మంచి చమత్కారాన్ని సాధించారు.

సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదలో_

'వెలది యీనీదండ వెలయెంత?
వాదండకును వెలబెట్ట నెవ్వనితరంబు
కలువతావులు గానమలి కదంబక వేణి
కలువతావులు వాడక మెకలుగు నె
కడివోదు నాకిమ్ము పడతి యీగేదంగివన
కడవోమి ముందటికి జూడు
జాతులే పంబుచేతుణ వద్మనులు సైతము
కున్న యెడ జాతులనికి యరుద'
... ... ... 2 ఆ. 19 ప.

(సశేషము)

# 5. పశ్చిమగోదావరి జిల్లా - స్థలనామాలు

— డా. లక్కంశెట్టి కోటమల్లేశ్వరరావు

పశ్చిమగోదావరి జిల్లాకు తూర్పున గోదావరి, దక్షిణాన బంగాళాఖాతం, కృష్ణా జిల్లాలు, పశ్చిమాన కృష్ణాజిల్లా ఉత్తరాన ఖమ్మంజిల్లా వ్యాపించి ఉన్నాయి.

**చరిత్ర:** దొరికిన శాసనాలు, నాణేలు మొదలయిన ఇతర సామగ్రినిబట్టి చరిత్రకు తెలిసినంతవరకూ ఈ జిల్లాలో ఆంధ్ర శాతవాహనరాజులే ప్రాచీనులు. క్రీ॥ పూ 260లో అశోకుడు శాతవాహనుల్ని జయించాడు కాని వారి పాలనను అంతం చేయలేదు. క్రీ॥ శ॥ 7వ శతాబ్దినుంచి తూర్పు చాళుక్యులు ప్రాభవంలోకి వచ్చారు. బాదామి చాళుక్యరాజయిన రెండవ పులకేశి క్రీ॥ శ॥ 616లో పిఠాపురం ఏలూరులను జయించి తన ప్రతినిధిగా కుబ్జ విష్ణువర్ధనుడ్ని నిలిపాడు. కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ॥ శ॥ 632లో స్వతంత్రతను ప్రకటించు కొని పెదవేగి రాజధానిగా వేంగి సామ్రాజ్యాన్ని, తూర్పు చాళుక్య వంశాన్ని స్థాపించాడు. ఈ వంశం దాదాపుగా అయిదు శతాబ్దాల కాలం వేంగి సామ్రాజ్యాన్ని పాలించింది. క్రీ॥ శ॥ 999లో చోళరాజయిన రాజరాజు తూర్పు చాళుక్య సామ్రాజ్యాన్ని జయించి, శక్తివర్మను తన సామంతునిగా నియమించాడు. అతని సోదరుడయిన విమలాదిత్యుడు మరల వేంగిని జయించి గంజాం జిల్లాలోని మహేంద్రగిరి వరకుగల భూభాగాన్ని వశపరచుకున్నాడు. అతనికుమారుడు రాజరాజనరేంద్రుడు క్రీ॥ శ॥ 1022 నుంచి 1062 వరకు రాజమహేంద్రవరం రాజధానిగా వేంగిసామ్రాజ్యాన్ని పాలించాడు.

రాజరాజనరేంద్రుని మరణానంతరం అతని తమ్ముడు విజయాదిత్యుడు రాజయ్యాడు. ఈ కాలంలోనే రాష్ట్రకూట రాజయిన రెండవ విక్రమాదిత్యుడు రెండు సార్లు వేంగి సామ్రాజ్యంమీద దండెత్తాడు. కాని చోళరాజు అతనిని తరిమివేసి వేంగి సింహాసనం మీద విజయాదిత్యుడ్ని నిలిపాడు. ఇతడు కళింగదేశంలోని చక్రకోట వరకు గల భూభాగాన్ని జయించి వేంగి సామ్రాజ్యంలో కలిపాడు. క్రీ॥ శ॥ 1069లో చోళరాజు మరణించడంతో బాదామి చాళుక్య రాజు ఆరవ విక్రమాదిత్యుని సాయంతో చోళ రాజు కుమారుడు సింహాసనాన్ని వశపరచు కొన్నాడు. మనవడిగాను, దత్తుడుగాను తన హక్కునిలుపుకోవటానికి కులోత్తుంగుడు ఆరవ విక్రమాదిత్యుడితో పోరాడి కులోత్తుంగ చోళుడనే పేరుతో చోళసామ్రాజ్యానికి వేంగిసామ్రాజ్యానికి అధిపతి అయ్యాడు. వేంగికి మాత్రం తన పినతండ్రి విజయాదిత్యుడ్ని ప్రతినిధిగా కొనసాగనిచ్చారు. క్రీ॥ శ॥ 1077లో విజయాదిత్యుని మరణానంతరం తన రెండవకుమారుడు రాజరాజును ప్రతినిధిగానియమించాడు. కాని అతడు దానికి ఇష్టపడకపోగా 1078లో అతని సోదరుడు వీరచోడుడు ప్రతినిధి అయ్యాడు. 1084లో కులోత్తుంగ చోళుని పెద్దకొడుకు రాజరాజ చోడగంగు ప్రతినిధిగా వచ్చాడు. మరల 1089లో వీరచోడుడు ప్రతినిధి అయి 1093 వరకు ఉన్నాడు. బాదామిచాళుక్య రాజయిన ఆరవవిక్రమాదిత్యుడు క్రీ॥ శ॥ 1120-1124 లమధ్య వేంగివిషయాధీశుడయ్యాడు. క్రీ॥ శ॥ 1163 నుంచి 1186 వరకు మూడవ గొంక రాజు ఈ ప్రాంతాన్ని పాలించాడు. 13వ శతాబ్ది ప్రారంభంనాటికి ఈ ప్రాంతంకాకతీయుల వశమైంది. క్రీ॥ శ॥ 1162 నాటికి రుద్రదేవుడు శ్రీశైలంనుంచి బంగాళాఖాతం వరకు గల భూభాగాన్ని జయించాడు. 1190లో అతని కుమారుడు గణపతిదేవుడు రాజయ్యాడు. అతనితర్వాత రుద్రమదేవి కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించింది. క్రీ॥ శ॥ 1292లో ప్రతాపరుద్రుడు రాజయ్యాడు. 1323లో తుగ్లక్ ప్రతాపరుద్రుడ్ని జయించాడు. ఈ సమయంలో ఈజిల్లా దక్షిణ భాగం కొండవీటి రెడ్డిరాజుల అధీనంలోను, ఉత్తరభాగం కళింగ సామ్రాజ్యంలోను భాగాలుగాఉన్నాయి. క్రీ॥ శ॥ 1515లో ఈ ప్రాంతం కృష్ణదేవరాయలవశమైంది కాని గజపతుల పాలనలో ఉంది. క్రీ॥ శ॥ 1512లో కులీకుతుబ్‌షా కుతుబ్‌షాహి వంశస్థాపన చేశాడు. ఇతనికి ఒరిస్సారాజుకు కుదిరిన ఒప్పందంవల్ల కృష్ణా గోదావరుల మధ్యభాగం గోల్కొండ సామ్రాజ్యంలో ఉంది. క్రీ॥ శ॥ 1704లో గోల్కొండ నవాబు తానీషా మరణంతో ఈజిల్లా ఔరంగజేబు వశంకాగా అతడు అసఫ్‌జాను దక్కను సుబేదారుగానియమించాడు. క్రీ॥ శ॥ 1748లో అసఫ్‌జా మరణించగా తనకు సుబేదారు కావటానికి సాయపడిన ఫ్రెంచివారికి సలాబత్ జంగ్ నరసాపురం, కొండపీడు రాజ్యాలను ఇచ్చాడు. ఈ ప్రాంతమంతా 1801 నాటికి ఇంగ్లీషువారి వశమైంది. 1859లో రాజమండ్రి, మచిలీపట్నం, గుంటూరు సర్కారులు కృష్ణాగోదావరి జిల్లాలుగా రూపొందాయి. 1904లో ఈరెండు జిల్లాలు మరల విభజింపబడి 7 తాలూకాలతో పశ్చిమ గోదావరిజిల్లా అవతరించింది. 1942లో తూర్పుగోదావరిజిల్లా నుంచి పోలవరం తాలూకాను పశ్చిమగోదావరి జిల్లాలోకలిపారు. 1985 లో ఈజిల్లా మండలాలుగా విభజించబడింది.

## భాషావిశేషాలు

### ఏకపద ఘటిత గ్రామాలు :

ఈ జిల్లాలోని ఊళ్ళపేర్లలో ఉండి కవిటం, కాజ, కాళ్ళ, గొంది చిడిపి జాత్తిగ, తేప, పాళి, మైప, మొర్త, వింజరం, పేంద్ర

మొదలయిన గ్రామాలపేర్లు ఒకే పదంలో ఏర్పడ్డవి.

**సమాసఘటిత గ్రామనామాలు :**

పశ్చిమగోదావరిజిల్లాలో సమాసరూపంలో ఉన్న గ్రామనామాలు మూడు రకాలుగా ఉన్నాయి. అవి సిద్ధ, సాధ్య, ఆచ్ఛిక మిశ్ర సమాసఘటితాలు.

**సిద్ధ సమాస ఘటితాలు :**

ఉదా : నరసింహపురం, రామానుజపురం, శ్రీనివాసపురం, సిద్ధాంతం.

**సాధ్యసమాస ఘటితాలు :**

ఉదా : ధర్మాజీగూడెం, వెంకటరాజపురం.

**ఆచ్ఛిక సమాస ఘటితాలు :**

ఉదా : ఎనమదుర్రు, పెనుమర్రు.

**మిశ్ర సమాస ఘటితాలు :**

ఉదా : పురుషోత్తపల్లె, భువనపల్లె.

ఈజిల్లాలోని కృష్ణాపురం, భోగాపురం, రంగాపురం, వెంకటాపురం మొదలయిన సిద్ధసమాసఘటిత గ్రామనామాల్లో సహజంగా హ్రస్వాంతమైన విశేషణం దీర్ఘాంతంగా మారడం విశేషం. ఇలాగే పదమధ్యంలో సహజంగా హ్రస్వత ఉన్నచోట్ల కూడా దీర్ఘత్వం గోచరించడం వక్రాయగూడెం, బావాయపాలెం మొదలయినపేర్లలో కనిపిస్తుంది.

**విశేషణాలు :**

ఈ జిల్లాలో సమాసరూపంలో ఉన్న గ్రామనామాల్లోని విశేషణాలను ఈక్రింది విధంగా విభజించవచ్చు.

అవి

1. వాతావరణ సూచకాలు :
ఉదా : ఎండగండి, ఎండపల్లి

2. పరిమాణ సూచకాలు :
ఉదా : చినకాపవరం, చినరామచంద్రపురం, పెదకోపల్లె, పెద్దేవం

3. గ్రామనామ సూచకాలు :
ఉదా : కొవ్వూరుపాడు, చిక్కాలపాలెం, మద్దూరులంక, వల్లూరుపల్లె.

4. పురుషవ్యక్తి సూచకాలు :

అ) తూర్పు చాళుక్య సంబంధులు :
ఉదా : చాళుక్య భీమవరం

ఆ) రెడ్డి వంశ సంబంధులు :
ఉదా : కామరవరం, పోలవరం, వేమవరం.

ఇ) కాకతి వంశ సంబంధులు
ఉదా : గణపవరం

ఈ) గజపతి వంశ సంబంధులు :
ఉదా : పురుషోత్తపల్లె

ఉ) జమీందారీ సంబంధులు :
ఉ॥ మేదినరావుపేట (శనివారప్పేట జమీందారీ) ధర్మాజీగూడెం, వెంకటాద్రిగూడెం (నూజివీడు జమీందారీ)

5. స్త్రీ వ్యక్తి సూచకాలు
ఉదా : అక్కంపేట, ఎర్రంపేట, కాంతంపాలెం. గౌరీపట్నం, నందమూరు, వారంపాలెం.

6) పుష్పసూచకాలు :
ఉదా : కలువచెర్ల. కలవపూడి, మల్లెపూడి.

7) వృక్ష సూచకాలు :
ఉదా : జీలుగుమిల్లి, తంగెళ్ళమూడి, నేరేడుమిల్లి, బూరుగుపల్లి, రావులపర్రు.

8) శాక సూచకాలు :
ఉదా : కాకరపర్రు, దోసపాడు, వంగూరు.

9) సస్య సూచకాలు :
ఉదా : చెరుకుమిల్లి, చోడిమెల్ల.

10) సరీసృప సూచకాలు :
ఉదా : కుమ్మరపురుగుపాలెం, పాములపర్రు, బల్లిపాడు.

11) పక్షి సూచకాలు :
ఉదా : కాకినాడ, కొక్కిరపాడు, కోళ్ళపర్రు, చిలకపాడు.

12) కాల సూచకాలు :
ఉదా : కొత్తగూడెం, కొత్తపల్లె, కొత్తపాడు.

13) వాసర సూచకాలు :
ఉదా : సోమవారప్పాడు, శనివారప్పేట.

14) వర్ణ సూచకాలు :
ఉదా . ఎర్రగుంటపల్లె, చేబ్రోలు, నల్లజర్ల, వెల్లచింతలగూడెం.

15) భూస్థితి సూచకాలు :
ఉదా : కొండగూడెం, లంకలకోడేరు, పోడూరు.

16) పానీయ సూచకాలు :
ఉదా : పాలకొల్లు, పాలకోడేరు, పాలూరు.

17) సాధన సూచకాలు :
ఉదా : బాటపర్రు, కడికలపూడి, తుపాకులగూడెం.

18) నిర్మాణ సూచకాలు :
ఉదా : గుడిగుంట, మేడపాడు.

19) దిక్సూచకాలు :
ఉదా : ఎడపల్లి, చిగురులంక, తూర్పువిప్పర్రు, వెలివెన్ను.

20) గృహ నామ సూచకాలు :
ఉదా : కర్రావారి సావరం, గణపవారిగూడెం, పుప్పలవారి గూడెం.

21) కుల సూచకాలు :
ఉదా : కంసాలిబేతపూడి, కాపవరం, కోమటిగుంట, రాజవరం.

22) అధికార సూచకాలు :
ఉదా : నవాబుపాలెం, ప్రెగడపల్లె.

23) మత సూచకాలు :
ఉదా : నందిగూడెం, శివగూడెం, శంఖచక్రపురం.

**విశేష్యాలు-వాటి వ్యుత్పత్తులు**

అగ్రహారం : వి రాజు బ్రాహ్మణులకు

దానమిచ్చిన భూమిలేదా గ్రామం, బ్రాహ్మ ణులు నివసించేవీధి లేక గ్రామం. సం. అగ్రహార-, ప్రా. అగ్గహార - < సం. అగ్రహార - ఉదా : కానూరు అగ్రహారం, పెన్నాద అగ్రహారం.

అంగి. వి. కృష్ణా మొదలైన జిల్లాలలోని ఊర్ల పేర్ల చివరవచ్చే అంకి కి రూపాంతరం, సరిహద్దు. ఉదా : పొన్నంగి, రేలంగి, వేడంగి.

అర : ప్రత్యయం. ఉప్పర, కమ్మర మొదలయిన వృత్తి వాచకాలలో 'అర' కు పనిచేసేవాడు అని అర్థం. కాగా గ్రామనా మాల్లో పనిచేసే చోటు అని అర్థం. ఉదా : కొమ్మర.

అఱ్ఱు : వి. ఉపకంఠం, చేరిక, సమీపం. వర్రుకు రూపాంతరం. క. అట్టు సన్నిహి తంగా ఉండు. ఉదా : ఆగర్రు, కొమర్రు.

అవి : వి. అర్థం ఇంకా పరిశీలించాలి. ఉదా : తేతలి, సీసలి.

-అద : వివాదమొక్క రూపాంతరం. సం. వాటి-, ప్రా. వాట < ప్రా. వాటు-

ఉదా : కొమరాద, బొండాద.

ఆము వి. వ్రజ. హిం. ఉ. ఆమ్ సర్వ సామాన్యమైన < ఉ. ఆమ్. ఉదా : చిపటాం.

ఆల : వి. అర్థం పరిశీలించాలి. ఉదా : గూటాల, చిట్యాల, పెండ్యాల.

అలి : వి. కొన్ని గ్రామనామాల్లో ఉత్తర పదం సం. అలి - నిరుపయోగమైన.

< సం. అలి: ఉదా : వడాలి.

ఇలి : వి. అర్థం పరిశీలించాలి. ఉదా : ఆత్తిలి, ఉనికిలి, ఎలమంచిలి, పెనుమంచిలి.

ఊరు : వి. గ్రామం. క. ఊర్, ఊరు త. ఊర్ < మూ. ద్రా. ఊర్.

ఏరు : వి. అర్థం ? ఉదా : ఆరేరు, వరిగేరు.

ఓలు : వి. ప్రోలుకు రూపాంతరం. ఉదా: ఎడవోలు, గంగోలు, విడదవోలు, సత్య వోలు.

కట్ల : వి. అర్థం పరిశీలించాలి. ఉదా : అరట్లకట్ల.

కల్లు : వి. రాయి క. కల్ కలు కల్లు రాయి, త.కల్ 'రాయి', మ. కల్లు రాయి < మూ. ద్రా. కల్. ఉదా : దాగల్లు, మోగల్లు.

కుంట : రూ. గుంట రూ. గుంట. వి. 1) నీటిగుంట; 2) చెరువు 3) భూపరిమాణ విశేషం 4) అరఎకరం. సం. కుంట - గొయ్యి, జలాశయం : ప్రా. కుండ - జలా శయం క. కుంటె నీటిగుంట. త. కుంటు మడుగు. ఉదా : గుండుకొలనుకుంట, రావులకుంట.

కుదురు : వి. 1) పాదు; 2) స్థానం, ఆశ్రయం; 3 నెలవు, ఒనికిపట్టు క. కుదురు. స్థిరపడు; కుదురు నదిరెండుపాయలకు సము ద్రానికి మధ్య ఉండే భూమి. పో. చూ. క. కుదురు. ఉదా : రాయకుదురు.

కుర్రు : లి. మిట్ట ఉదా : ఇలపకుర్రు.

కొలను : రూ. కొల్లు వి, 1) చెరువు, సరస్సు : 2) చిన్నగుంట క. కొళ, కోళ, క్యొహె చిన్నగుంట, తు. కుళ చెరువు త మ కుళమ్. ఉదా : అరుగొలను, చిననింద్ర కొలను. కొల్లు రూ. చూ. కొలను ఉదా : పాలకొల్లు.

కోట : వి. 1) దుర్గ 2) దుర్గప్రాకారం. 3) కళ్ళంచుట్టూ పలిగిన గద్దితో వేసేకట్ట క. కోంటె దుర్గం; తు. కోటె; త, కోట్టై; మ. కోటు < మూ. ద్రా. కోట్ట్ - ఉదా : కామవరపుకోట, కొండ్రకోట.

ఖండ్రిక : వి. 1) చిన్నపల్లె, 2) పన్ను లేకుండ గుత్తకిచ్చిన భూఖండం సం. ఖండ రక్ష - ప్రా. ఖండరక్ష - పన్నులు పసూలు చేసే ఉద్యోగి : మరా. ఖండరఖా చిన్నపల్లె < మరా. ఖండరఖా ఉదా : గురువుగుంట ఖండ్రిక, జంగంవారి ఖండ్రిక చేబ్రోలు ఖండిక.

గడప : వి. 1) ద్వారం కిందికమ్మి 2) నాగటితో దున్నిన రెండుచాళ్ళమధ్యగ కల పని భాగం. త. కడై ద్వారం. ప్రదేశం, కటపై గడప ఉదా : దుంపగడప.

గండి : వి. 1) సందు, అవకాశం; 2) రంధ్రం; 3) బిలం; 4) గుంట, నీ 5) నీళ్ళు పోయేదారి; 6) చెరువు మొ॥ గట్టు తెగినచోటు. క. కండి, గండి బెజ్జం; తు. కండి, గండి; మ. కంటి ఉదా : ఎండగండి.

గిరి : వి. కొండ సం. గిరి. < సం. గిరి. ఉదా. శివగిరి.

గుంట : రూ. చూ. గుంట. వి. 1) నీటి గుంట, 2) చెరువువేల. ఉదా : ఏపిగుంట, కోమటిగుంట, జీడిగుంట, తూటిగుంట.

గూడెం : వి. 1) బోయపల్లె : 2) చిన్న పల్లె; రిపేట. ఉదా : కొండగూడెం, జంగా రెడ్డిగూడెం, తాడేపల్లిగూడెం మల్లయ్య గూడెం.

చెర్ల : వి. కొన్నిగ్రామనామాల్లో ఉత్తర పదం. < చెరువు+ల. ఉదా : వల్లెర్ల, కలవచెర్ల, రాచెర్ల.

దీవి. వి. నీటినడిమిదిబ్బ సం. ద్వీప - ప్రా. దీవ క. దీవ, దీవి, మ. తీవు, దీవు < ప్రా. దీవ. ఉదా : వేములదీవి.

తుర్రు : వి. దుర్రు ఉదా : మొగలితుర్రు.

దుర్రు: వి. తుర్రు. బహుశ తోపులేక తోట అని అర్థంకావచ్చు ఉదా : ఉనుదుర్రు, ఎనమదుర్రు, పెలగదుర్రు.

దేవం : కొన్ని గ్రామనామాల్లో అంత్య పదం సం. దేవ - దేవుడు. < సం. దేవ, ఉదా : కుమార దేవం, పెద్దేవం.

పట్నం : వి. పట్టణం, నౌకాశ్రయంగల ఊరు. సం. పట్టణ - పత్తన - నౌకాశ్రయం గల ఊరు, పెద్దఊరు ప్రా. పట్టణ < ప్రా.

పట్టణ ఉదా : కాళాపట్నం, గోపీనాథపట్నం. గౌరీపట్నం, మహదేవ పట్నం.

పట్ల : వి. కొన్ని గ్రామనామాల్లో ఉత్తర పదం. < పట్టు + లు + అ పట్టు: వి, స్థానం, చోటు. 2) చిన్నగ్రామం. క. పట్టి ఇల్లు, నివాసం, త. పట్టి గోశాల, కుగ్రామం ఉదా : బొడ్డిపట్ల. వెల్లంపట్ల.

పఱ్ఱు : వి. ఉప్పనందేభూమి. ఉదా ; ఇల పఱ్ఱు, కోతలపఱ్ఱు, గుంపఱ్ఱు, పద్దిపఱ్ఱు.

పల్లి : రూ. మిల్లి. వి. చిన్నగ్రామం. క. పళ్ళి, హళ్ళి పల్లె: త. పళ్ళి ఉదా : గోకినేపల్లి, బూరుగుపల్లి.

పాక : వి. నదీతీర గ్రామం త. పాక్కమ్ సముద్ర తీరగ్రామం ఉదా : మండపాక.

పాడు : వి. 1) గ్రామం నశించిన ప్రదేశం. 2) దున్నవిభూమి; 3) జిగురుఇసుక సమపాళ్ళలో ఉన్న ప్రదేశం. క. పాడి కొత్తగా ఏర్పరచుకొన్న గ్రామం, త. పాటి పల్లెటూరు, గొల్లకాపర్ల గ్రామం, మ. పాటి, పాటకమ్ గ్రామంలో ఒక భాగం ఉదా : అట్లపాడు, కాగుపాడు, బల్లిపాడు, రావిపాడు.

పాలెం : వి. చిన్న ఊరు, గ్రామం క. పాళ్య, పాళయ, పాళె, పాళెయ త. పాళైయమ్, మ. పాళయం. ఉదా : అప్పయ్యపాలెం, కాంతం పాలెం, నోవాలుపాలెం.

పురం : వి. నగరం. సం. పుర-నగరం < సం. పుర ఉదా : అలంపురం, వరసాపురం, వెంకటాద్రి అప్పారావు పురం.

పూడి : రూ. మూడి వి. కుగ్రామం. క. హొణ్ణికుగ్రామం త. పూణ్డి నగరం, గ్రామం, జిల్లా, ఉదా : కొండేపూడి, తాడిపూడి.

పేట : వి. 1. నగరం, పట్టణం 2) నగరంలో భాగం 3) అంగడివీధి 4) పల్లె. 5) వరస. క. పేటె వస్తువిక్రయశాల, అంగడి వీధి, వంత జరిగే ఊరు. మ. పేట్ట మదురు వాడ, శాఖానగరం. సం. పింతా విటజను లుండే ప్రదేశం, ఉదా : అక్కంపేట ఎర్రం పేట, తిరుమలదేవిపేట, సెట్టిపేట.

ప్రోలు : రూ. ఓలు వి. పురం. క. పొటిల్ పట్టణం, నగరం, త. మ. పొటిల్ < మూ. ద. ద్రా. పుటిల్. ఉదా: చేబ్రోలు.

మూడు రూ. చూ. పాడు వి. గ్రామం నశించిన ప్రదేశం. ఉదా : నల్లమూడు, పొనుగుమూడు.

మామిడి : వి. 1) వృక్షవిశేషం, 2) కొన్ని గ్రామనామాల్లో ఉత్తరపదం క. మా, మామ్, మావు, త. మామరం : మ. మా. ఉదా : కోరుమామిడి.

మిల్లి : రూ. చూ. పల్లి. వి. చిన్న గ్రామం. ఉదా : తరుగోపుమిల్లి, కాకరమిల్లి చెరుకుమిల్లి, నేరేడుమిల్లి.

మీరం : వి. 1) మేర, హద్దు, 2) ప్రదేశం, 3) పొలంగట్టు సం. మర్యాదా పరిహద్దు. ప్రా. మేరా క. మేరె హద్దు. < ప్రా. మేరా, ఉదా : చినమీరం, పెదమీరం.

మూడి : రూ. చూ. పూడి. వి. కుగ్రామం. ఉదా : కాకర్లమూడి, గొరగనమూడి, తంగెళ్లమూడి.

మెట్ట : వి. మెరక, వర్షాధారంతోపండే నేల. క. మిట్ట కొండ. ఉదా ; పెనకమెట్ట.

మెల్ల వి. ఊరిబయలు వి. మెల్లా అరుబయలు < వి. మెల్లా.

రేవుల < రేవు + లు + అ వి. 1) నది మొదలయిన చోట్ల దిగటానికి ఏర్పాటు చేసిన ప్రదేశం 2) సముద్రంలో ఎగుమతి దిగుమతులు జరిగేచోటు ఉదా : అరికిరేవుల.

సంధులు :

పశ్చిమగోదావరి జిల్లాలోని గ్రామనామాల్లోని సంధులన్నీ తెలుగు సంధులే.

అకారసంధి :

అ+అచ్చు- అచ్చు

అ+అ-పొన్న + అంగి - పొన్నంగి.

అ+ఊ-కోలమ+ఊరు-కోలమూరు.

నందమ + ఊరు-నందమూరు.

ఇకారసంధి :

ఇ+అచ్చు = అచ్చు.

ఇ + ఇ - అత్తి + ఇలి - అత్తిలి.

మంచి + ఇలి - మంచిలి.

ఉంచి + ఇలి - ఉంచిలి.

ఉకారసంధి :

ఉ+అచ్చు-అచ్చు.

ఉ + ఇ - క్రొవ్వు + ఇడి - క్రొవ్విడి

ఉ + ఏ - తాడు + ఏరు - తాడేరు.

ఔపవిభక్తికసంధి :

గోరు+ఏరు - గోటేరు.

తూరు + గుంట - తూటిగుంట

ముప్పళ్ళు + పాడు - ముప్పర్తిపాడు.

ద్రుతప్రకృతికసంధి :

పెను+తువ్వ - పెన్ + తువ్వ-పెందువ్వ

టుగాగమసంధి :

పొంగు+ఊరు = పొంగు + టు+ఊరు= పొంగుటూరు.

పుంప్వాదేశసంధి :

కామవరము + పాడు = కామవరపు + పాడు=కామవరప్పాడు

సోమవరము+పాడు-సోమవరపు+పాడు- సోమవరప్పాడు.

జానపదవ్యుత్పత్తులు :

ఊళ్ళకుపేర్లు ఏర్పడటంలో భౌగోళికస్థితిగతులు, చరిత్ర మొదలయిన అంశాలు ప్రాధాన్యం వహిస్తాయి. అయితే పేర్లు ఏర్పడిన తర్వాత కొన్ని ఊళ్ళ అసలు వ్యుత్పత్తులు మరుగున పడిపోగా వాటి స్థానంలో కొన్ని కృతకంగా సృష్టించిన పురాణగాథలు చోటుచేసుకుంటాయి. ఇటువంటి వ్యుత్పత్తుల్ని కృతక వ్యుత్పత్తులు లేక కొన్ని జన నిరుక్తులు అంటారు. కొన్ని జననిరుక్తుల్ని కొన్ని చారిత్రకవ్యుత్పత్తుల్ని పరిశీలిద్దాం.

గణపవరం :

ఇదికాకతి గణపతి దేవునిపేర వెలసిన ఊరు.

చిలకపాడు :

ఇది శుక మహర్షి తపస్సుచేసిన ప్రదేశం అటకాబట్టి చిలుకపాడు అయిందట.

దువ్వ :

దూర్వాసుడు తపస్సు చేసిన ప్రదేశము.

దొరసానిపాడు :

150 సంవత్సరాలక్రితం ఒక తాసిల్దారు ఈ గ్రామాన్ని తనకుమార్తెకు పసుపు కుంకుమ మాన్యంగా ఇచ్చాడట. అప్పటి నుంచి ఇది దొరసానిపాడు అనిపిలువబడు తున్నదట.

నిడదవోలు :

ప్రాచీన కాలంలో ఇది నిరవద్యపురము, నిరవద్యప్రోలు అని పిలువబడేది. ఇది క్రీ॥ శ॥ 699_729ల మధ్యనిరవద్య బిరు దాంకితుడయి వేంగిసామ్రాజ్యాన్ని పాలించిన తూర్పు చాళుక్యరాజు రెండవ విజయాదిత్యుని పేర నిర్మింపబడిన ఊరు. ఆంగ్లేయుల పుణ్యమా అని నిడదవోలుగా మారింది.

మండపాక :

వి. ఇది మాండవ్య మహర్షి తపస్సుచేసిన ప్రదేశమట.

మేదినరావుపాలెం :

శనవారప్పేట జమీందారు మేదినరావు గుంటి నరసింహరాజు ధైర్యసాహసాలకు మెచ్చి ఇచ్చిన ఊరుఇది. జమీందారుపేరిట మేదినరావుపాలెం అని పిలువబడుతోంది.

విజయరాయి :

శ్రీకృష్ణదేవరాయలు పెదవేగికోటను జయించి ఆ సమీపంలో ఉన్న ఈ గ్రామాన్ని బ్రాహ్మణులకు దానం చేశాడట విజయశిలా నగరం అనిపేరుగల ఈ ఊరు తెలుగులో 'విజయరాయి' అయిందట.

వేగేశ్వరపురం :

ఇది యోగులు తపస్సు చేసిన ప్రదేశం కనుక 'యోగీశ్వరపురం' అని పిలువబడి క్రమంగా వేగేశ్వరపురం అయిందట. బహుశ వేగిరాజధానిగా పాలించిన తూర్పు చాళుక్య రాజు ఎవరి పేరిటనో వేగీశ్వరపురం వెలసి ఉండవచ్చు.

# వేదన

బులుసు వేంకటేశ్వర్లు. ఎం. ఎస్,.సి.

ఏమిటో తెలియని మాయ లోనుంచి
ప్రపంచంలోకి వస్తున్న పసి బిడ్డ
కళ్ళువిప్పిన క్షణంనుంచి చూస్తున్న దేమిటి?
మొట్ట మొదటగా రంగులన్నీ కలబోసిన
తెలుపురంగు నిర్వేదానికి, స్వచ్ఛతకి
ప్రతీక యైతే
రంగుల ప్రపంచంలోకి అడుగెట్టిన బాల్యం
అర్థంకాని అయోమయ స్థితినుంచి ఎదిగిన
యవ్వనం _
వ్యర్థ వాగ్దానాలతో స్వార్థరాజకీయాలతో
నిండిపోయిన సంఘంలో వాసనలేని
పువ్వులా గమ్యంలేని నావలా
నిరర్థకపు జీవితంలో అడుగెట్టి సాగించి
ఈ జీవితమెందుకు అనే తత్త్వంలోపడి
తిరిగి ఏదో తెలియని మరోలోకంలోకి
పోతున్న జీవుడు.
ఈ జీవితానికర్థం ఏమిటి?
ఈ జన్మకు సార్థకత ఏమిటి?
ఈ చిన్న సత్యం తెలిసేదెప్పుడు?

(*.*)

---

మొత్తంమీద ఇటువంటి కృతక వ్యుత్పత్తుల్ని మినహాయిస్తే ఈ జిల్లా గ్రామనామాల్లో తెలుగుపాలు ముప్పాతిక వంతుకాగా సంస్కృతాది ఆర్యభాషల ప్రభావం పాతికవంతు కని పిస్తున్నది.

(*.*)

# 6. మధుచంద్రిక

— శ్రీ ప్రఖ్యా మధుబాబు

మదిలోన నీ తలపే మెదలుతూ ఉన్నాది
ఎదలోన ఏదేదో ఎగసి పడుతున్నాది

సాగరానికి వాగు సాగుతూ ఉన్నాది
నా మనసు నీ వంకే లాగుతూ ఉనాది

నీ కోసమే వేచి, ఆకాశమై చూచి
దేశాలు, వనాలు వెదకి నే నలసిపోయాను

నావలో కూర్చొని విన్ను నే తలపోసి
నీ ఊసులన్నీ తలచి ఉస్సురనుకున్నాను
అంతలో

కనుల ముందే నీవు నిలుచోని ఉన్నావు
చూసేది కలయేమొ చూసేది మాయేమొనని

గిల్లుకోని చూసి కళ్ళు నులిమీచూసి
మళ్ళి చూసే సరికి మాయమై పోయావు

నా చెంతనే ఉంది కూసింత మళ్ళి
నీ పొంత కెటనావని చింతతో లోకాన్ని

కలయజూస్తా ఉంటే కిలాకిలా నవ్వావు
నీ యెదురుగా రేవు ఎదలోనే ఉన్నావు

దాగుంది నాలోనె నా గుండె లోలోనె
దోబూచు లాడుతూ నను దోచు కున్నావు

పడగాలి నాపలేను కడగండ్ల నోపలేను
ఎండనే పడలేను ఎడబాటు మండలేను

తెప్పవైతే నీవు ఏరు నేనౌతాను
తెప్పనైతే నేను తెరచాప నీవేను

ఊరాలు, తీరాలు తేలుతూ పోదాము
వేరు లేదని మనము చేరువై పోదాము

కన్నీటి ఏటినే దాటేసి పోదాము
కలలోని లోకాలు కలిసెళ్ళి చూద్దాము

కరువు లేదే మనకు కల్పతరువున్నాది
బలమైన చెలిమనే కలిమొకటి వున్నాది

ఒడుదుడుకు లే లేక యిరువురము విడిపోక
కడలిలో మన పడవ సాగేను కడదాక

...—...

## 7. రససిద్ధాంతంపై రసవత్తర గోష్ఠి

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

15-9-90 మధ్యాహ్నం ప్రభుత్వ కళాశాల స్నాతకోత్తర విభాగం-తెలుగు శాఖ అధ్యక్షతలనుద్దేశించి ఆచార్య డా॥ పి. యస్. ఆర్. అప్పారావు (కేంద్రీయ విశ్వవిద్యాలయ దృశ్యకళావిభాగం) రససిద్ధాంతం మానవజీవితానికి ఎలా ముడిపడిఉన్నదో భారతీయాలంకారికులు ఆ సిద్ధాంతాన్ని ఎలా రూపొందించారో అనేక నిదర్శనాలిస్తూ ఉపన్యసించి మనోవికాసాన్ని చిత్తరంజనాన్ని కలిగించారు. కళల విషయంలో పాత కొత్తల మధ్య ఒక సంఘర్షణ వచ్చినపుడే అవి పునరుజ్జీవనం పొందుతాయని అంటూ జానపద కళారూపాలకే భవిష్యత్తు ఉజ్వలంగా ఉందని ఉద్ఘాటించారు.

ఈసభను ప్రారంభిస్తూ డాక్టర్ మిరియాల రామకృష్ణ, రాజమహేంద్రవరం మన సాహిత్యానికి పుట్టినిల్లనీ అందులో ప్రభుత్వకళాశాల ఎందరో సాహిత్య వేత్తల ఆలనా పాలనా అందుకున్నదనీ చెబుతూ తెలుగుఆకాడమికి రూపకల్పన చేసిన ఆచార్య పి. యస్. ఆర్. అప్పారావు ఈ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసినవారేనని గుర్తు చేశారు. శ్రీ అప్పారావు ప్రాచ్య-పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలను కలబోసి వడబోసి నాట్యశాస్త్రం, తెలుగునాటక వికాసం వంటి గ్రంథాలను వెలయించారని ఆయన సాహిత్య జీవితం త్రిపుటిగా అధ్యయనం, ఉపన్యాసం, గ్రథనకౌశలం అనే మూడురేకలతో వికసించిందని పేర్కొన్నారు. విద్యారంగ, సాహిత్యరంగాల్లో ఆయన కృతార్థతల్ని అభివర్ణించారు.

రససిద్ధాంతం గురించి అరటిపండు ఒలిచి పెట్టినంత సులువుగా బోధించారు అప్పారావుగారు నిత్యజీవితాన్ని ఒక కొలబద్దగా తీసుకుంటూ. ప్రేక్షకుడు, శ్రోత, సామాజికుడు, పాఠకుడు, సుమనస్కుడు, సహృదయుడు వంటి పారిభాషిక పదాలను గురించి వివరిస్తూ రసం వీరిలోనే నిద్రాణంగా ఉంటుందనీ శుష్కకాష్ఠానికి నిప్పంటిస్తే ఏవిధంగా మొత్తం అంటుకుంటుందో అలాగే శ్రవ్య దృశ్యకావ్యాలలోనివిభవాదుల వల్ల మనం ఉలిక్కిపడి కదిలి జలదరించి రసానుభవం పొందుతామనీ ఆయన వివరించారు. బాధ కలిగించే రౌద్రభీభత్సాదులు కూడా కావ్యంలో వ్యక్తమయినపుడు మనకు మనస్సులో కలిగేది ఆనందమే అన్నారు. మనకు ట్రాజెడీలు లేవనీ, అందుకు కారణం మన జీవితదృక్పథమే అనీ కావ్యనాయకుడితో మనం తాదాత్మ్యం పొందడలుస్తామనీ చెప్పారు.

అయితే పాశ్చాత్యుల విషాదాంత నాటకం హోమియోపతీ వైద్యంలాగ మనిషికి భయశోకాదుల నుంచి విముక్తి కలిగించే ప్రయత్నం అన్నారాయన. రసానుభూతిలోని వివిధ దశలను అయిదింటిగా వర్గీకరిస్తూ ఇంద్రియస్థాయి, భావనాస్థాయి, భావస్థాయి, సాధారణీకరణస్థాయి, తాదాత్మ్యస్థాయి అని పేర్కొన్నారు. ఆనందానుభూతి ఒక నిమిషమైనా కలిగితే అది రసమే అంటూ ఇంగ్లీషులో త్రిల్లు (Thrill) కీ రసానికీ తేడా లేదన్నారు. 'స్థాయిభావం'గురించి విశేషంగా వివరించారాయన.

విద్యార్థులు జానపద దృశ్యకళల భవిష్యత్తేమిటని- అప్పారావుగారిని ప్రశ్నించగా ప్రభుత్వం ఏదైనా జానపద దృశ్యకళలకే ప్రోత్సాహమివ్వక తప్పదనీ 'క్లాసికల్' కొందరికోసమేనని పాపులర్ అందరి కోసమూననీ వివరించారు సార్వజనిక సార్వకాలిక కళారూపాల్యాలన్నప్పుడు వస్తువుతో నిమిత్తంలేకుండా కూడా కళ జీవిస్తుందంటూ కన్యాశుల్కాన్ని పేర్కొన్నారాయన.

కుమారి మహాలక్ష్మి (ఎం. ఏ. విద్యార్థిని) వందనసమర్పణ చేశారు,

...——....

## రచయితలకు మనవి:

రచనలు వ్రాత తప్పులు
లేకుండ, చదవడానికి
వీలుగా స్పష్టంగా
ఉండాలి.

## చందాదారులకు మనవి :

చందాకాలం పూర్తికాగానే
తమంత తాముగాచందా
పంపించి సహకరించండి.
తమ పూర్తి ఎడ్రసు
పిన్ కోడ్ తోసహా
స్పష్టంగా తెలియ
పరచండి.

# 8. ధర్మో రక్షతి రక్షితః

— శ్రీ ఆచార్య దర్భా సూర్యనారాయణ F. I. E.

('మానవేధర్మశాస్త్రే, భృగుప్రోక్తాయాం - సంహిత' నుండి గ్రహించబడినది.)

శ్లో॥ యత్ర ధర్మో హ్యధర్మేణసత్యం
యత్రా నృతేన చ,
హన్యతే ప్రేక్షమాణానాం హతా
స్తత్ర సభాసదః ॥
మను అ8- శ్లో॥ 14.

తా. ఎచ్చట సభ్యులు చూచుచుండగనే, ధర్మ - మధర్మము చేతను, సత్యమసత్యము చేతను, కొట్టబడునో అచ్చట సభ్యులాపాపముచే గొట్టబడుదురు.

శ్లో॥ ధర్మ ఏవహతో హంతి
'ధర్మోరక్షతి రక్షితః,'
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో
ధర్మోహతోఽవధీత్ ।
మను. అ. 8-శ్లో. 15.

తా. ధర్మము చెఱుపబడినదై మనలను జెఱచును. ధర్మమును మనము కాపాడితిమేని మరలనది కాపాడును కావున ధర్మమును నశింపజేయరాదు. ధర్మము నశింపజేయబడనిదై మనలను నశింపజేయకుండును గాక.

శ్లో॥ వృషోహి భగవాన్ ధర్మ స్తస్యయః
కురుతే హ్యలమ్,
వృషలం తం విదుర్దేవా స్తస్మాద్ధర్మం
న లోపయేత్॥
మను. అ. 8 - శ్లో. 16.

తా. పూజ్యమైన ధర్మము, కోర్కెలన్నింటిని వర్షించుచున్నది. కావున వృష మనబడును. అట్టి వృషము నెవడు నిషేధించునో, వాడే వృషలుడనుబడు (శూద్రుడు) అనబడునుగాని, జాతిచే వృషలుడు, వృషలుడుకాడు. కనుక ధర్మము మీఱరాదు.

శ్లో॥ ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యను
యాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి.
మను. అ. 8 శ్లో. 17.

తా. ధర్మమనది యొక్కటియే ముఖ్యస్నేహితుడు. ఏలయన మరణానంతరము సైతము ధర్మమనెడి స్నేహితుడే మనలను వెంబడించును. మఱియు దక్కినదియెల్లరు మన శరీరముతోడనే నాశము నొందుచున్నది గదా.

శ్లో॥ పాదోఽధర్మస్యకర్తారం
పాదస్సాక్షిణ మృచ్ఛతి,
పాద స్సభాసద స్సర్వాన్ పాదోరాజాన
మృచ్ఛతి
మను. అ. 8. శ్లో 18

తా. నాల్గు పాదములు గలదగు నధర్మమున నొక్కొక్క భాగము అన్యాయమును నొనర్చు వానిని మఱియొక్క భాగము సాక్షిని మఱియొక్క భాగము సభ్యులనందఱిని మఱియొక భాగము రాజును బొందును.

శ్లో॥ ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ
మింద్రియ నిగ్రహః
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మ
లక్షణమ్॥
మను. అ. 6. శ్లో. 92

తా. సంతోషము, కీడొనర్చినవారికి మఱల కీడుచేయకుండుట యను క్షమ, వికారములకు హేతువున్నను, మార్పునొందకుండుట యను దమము, ఒరుల వస్తువు నపహరింపకుండుట, మంటితోను నీటితోను దేహమును గడుగుట యను శౌచము, విషయముల నుండి యింద్రియములను మఱల్చుట, శాస్త్రార్థములరహస్యము నెఱుగుట, ఆత్మజ్ఞానము, ఉన్నదున్నట్లు చెప్పుట, కోపములేమి యను నీ పదియు ధర్మమునకు గుఱుతులు.

శ్లో॥ ఆచార్యోఽ బ్రహ్మణోమూర్తిః
పితా మూర్తిః ప్రజాపతేః, ।
మాతా పృథివ్యా మూర్తిస్తుభ్రాతా
స్వామూర్తిరాత్మనః ॥
మను. అధ్యా. 2- శ్లో 225

తా. ఆచార్యుడు పరమాత్మ స్వరూపుడు, తండ్రి హిరణ్యగర్భ స్వరూపుడు, తల్లి భూదేవి స్వరూపురాలు, అన్న ఆత్మ స్వరూపుడు- వీరు దేవతారూపులు, కావున వీరిని దిరస్కరించరాదు.

శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృ
భక్త్యాతు మధ్యమమ్ ।
గురుశుశ్రూషయా త్వేవ
సత్యలోకం సమశ్నుతే ।
మను. అధ్యా - 6 శ్లో 233

తా. మాతృభక్తిచే నీ భూలోకమును, పితృభక్తిచే నంతరిక్షమును, గురుశుశ్రూషచే బ్రహ్మలోకంబును బొందుచున్నాడు.

శ్లో॥ ప్రాణాయామా బ్రాహ్మణస్య
త్రయోఽపి విధివత్కృతాః ।
వ్యాహృతిప్రణవైర్యుక్తా విజ్ఞేయంపరమం
తపః ॥
మను. అ. 6 - శ్లో 70.

తా. వ్యాహృతి ప్రణవములతోగూడ శాస్త్రప్రకారము బ్రాహ్మణుడు మూడు ప్రాణాయామములైనను జేయవలయును. అదియె యాతనికి నుత్తమ తపస్సుయని యెఱుంగవలయును.

శ్లో॥ అధి యజ్ఞం బ్రహ్మ జపే దాధి
దైవిక మేవ చ

...ధ్యాయికం చ సతతం వేదాంతాభి
హితం చ యత్ ॥
మను. అధ్యాం శ్లో 83

తా. యజ్ఞములఁ గూర్చినదియు, దేవ... గూర్చినదియు, జీవాత్మను గూర్చి... వేదాంతము అందుఁ బ్రతి... దియునైన వేదమును ... ఠింప వలయును.

...త్యం బ్రూయాత్ ప్రియం
...న్న బ్రూయా త్సత్య మప్రి
యమ్
...చ నానృతం బ్రూయా దేష
ధర్మస్సనాతనః ॥
మను. అధ్యా - 4. శ్లో. 138

తా. విన్నది విన్నట్లును, చూచినది ...దినట్లును, చెప్పుట సత్యము, అట్టి ... చెప్పవలయును. ఎదుటి వాని ...నకు తగినట్లు చెప్పుట ప్రియము, ప్రియమును బలుకవలయును. సత్య... నప్రియమును జెప్పరాదు. ...త్యము నసత్యమును బలుక... ఇది వేదమూలముగాన సనాది ధర్మము.

...త్ర నార్యస్తు పూజ్యంతే రమంతే
తత్ర దేవతాః ॥
...త్రైతాస్తు న పూజ్యంతే సర్వా
స్తత్రా ఫలాః క్రియా
మను. అధ్యా. 3 - శ్లో 56.

తా. ఏకులమున స్త్రీలు (సతివలు) ...ంపబడుదురో, ఆకులమున వారిపై ... దయ గలిగియుందురు. ఏకుల ... విరి మన్ననలు లేవో, యాకులము ... క్రియలన్నియు, నిష్ఫలములు.

...తుష్టో భార్యయా భర్తా భర్త్రా
భార్యా తథైవ చ
...స్మిన్ కులే నిత్యం కల్యాణం
తత్ర వై ధ్రువమ్ ॥
మను. అధ్యా 3 శ్లో 60

తా. ఏకులంబున భార్యచే భర్తయు, భర్తచే భార్యయు సంతసము గలిగి యుందురో, ఆ కులంబున సంపద యెల్లప్పుడు స్థిరముగా తాండవమాడుచుండును.

శ్లో॥ యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే
సర్వజంతవః
తథా గృహస్థ మాశ్రిత్య వర్తంతే సర్వ
ఆశ్రమాః ॥
యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానే
నాన్నేన చాన్వహమ్ ॥
గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠా
శ్రమో గృహీ ॥
మను. అధ్యా 3 - శ్లో 77, 78

తా. ప్రాణవాయువు నాశ్రయించి జంతువులెల్ల జీవించునట్లు, గృహస్థుని నాశ్రయించి, తక్కిన యాశ్రమస్థులు జీవింతురు.

గృహస్థుడు తక్కిన యాశ్రమముల వారిని, వేదాధ్యయనము చేయించియు, అన్నపానముల నొసంగియు, ప్రతిదినము వారిని పోషించు చున్నాడు. గావున గృహస్థుడన్ని యాశ్రమముల వారిలో శ్రేష్ఠుఁడనబడును.

శ్లో॥ అహింసాసత్యమ స్తేయం। శౌచ
మింద్రియ నిగ్రహః।
ఏతం సామాసికం ధర్మం।
చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనుః,
మను. అ_10 శ్లో 8

తా. అహింస, సత్యము, పరులధనము తీసుకొనకుండుట, పరిశుభ్రత, ఇంద్రియ నిగ్రహము - యివి నాలుగు వర్ణముల వారికిన్ని పరమధర్మములు.

శ్లో॥ నాస్తిక్యం వేదనిందాం చ దేవతా
నాం చ కుత్సనమ్।
ద్వేషం దంభం చ మానం చ క్రోధం
తైక్ష్ణ్యం చ వర్జయేత్ ॥
మను అ 4_ శ్లో 163

తా. నాస్తిక్యము, వేదనింద, దైవ దూషణం. ద్వేషము, దంభము, అహంకారము, కోపము, క్రౌర్యము_వీటిని విడువవలెను.

శ్లో॥ యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం
యత్రానృతేన చ
హన్యతే ప్రేక్షమాణానాం హతా
స్తత్ర సభాసదః॥
మను _ అ 8 శ్లో 14

తా. ఏ న్యాయసభయందు ధర్మము అధర్మముచేతను, సత్యము, అనృతముచేతను కొట్టబడుతూంవో, ఆసభలోని సభాసదులు, మృతతుల్యులే అవుతున్నారు.

శ్లో॥ ఆచారాల్లభతే హ్యాయుః ఆచార
దీప్సితాః ప్రజాః
ఆచారాద్ధన మక్షయం ఆచారో
హన్త్యలక్షణమ్॥
మను. అధ్యా-4-శ్లో 156

ఆచారమువల్ల దీర్ఘాయువు కలుగుతుంది జనులకోరికలు దీనివలననే కలుగుతాయి. తరుగని సంపదలు కలుగుతున్నాయి. ఆచారము పాటించనిచో ప్రమాదము కలుగుచున్నది.

సత్త్వగుణముల యొక్క కార్యములు

శ్లో॥ వేదాభ్యాస స్తపో జ్ఞానం శౌచ
మింద్రియ నిగ్రహః
ధర్మక్రియాత్మ చింతా చ సాత్త్వికం
గుణలక్షణమ్॥
మను అధ్యా-12 - శ్లో 31

తా. వేదాభ్యాసము, ప్రాజాపత్యాది తపం బొనర్చుట, శాస్త్రార్థ జ్ఞానము; మృత్తు, జలము_వీనితో పరిశుద్ధి చేసుకొనుట, యింద్రియ నిగ్రహము, దానాది సత్కార్యము లొనర్చుట, బ్రహ్మజ్ఞానము నందాసక్తి యివి సత్త్వగుణముల యొక్క కార్యములు.

శ్లో॥ చతుర్వేద సమం పుణ్య మస్య
శాస్త్రస్య ధారణాత్।

# 1. సాధనాల వారి "దృశ్యం" కమనీయ కవితా దృశ్యం

— శ్రీ పి. వి. ఎల్. సుబ్బారావు బి.యస్.సి. ఎం ఏ.. ఎం. ఇడి.

'ఇలాతలంపై పూర్ణకాంతుల
దివ్యోత్తేజాన్ని కల్గిస్తాను.
ఈ లోకాన్ని ప్రక్షాళన గావించి
పరిశుద్ధం చేస్తాను'

అంటూ తన కవితాకిరణాలచే జన హృదయ కమలాలను విచ్చుకొనేటట్లు చేయ గలిగినకవి, సాధనాల వేంకటస్వామినాయుడు గారు. వారి వచనకవితా సంకలనం 'దృశ్యం' కవిత్వం గురించి వారి మాటల్లో 'నాకు నేను దూరమై పోతున్నాననే ఆవేదన నన్ను పట్టి పీడిస్తున్నపుడు నన్ను నాకు అప్పగించే ప్రయత్నంలో పేర్చుకున్న అక్షరాల కట్టడాలు నా కవిత్వం.' ఆ కట్టడాలు జనహృదయాలను ఆకట్టుకొనేవి కాబట్టివారి 'దృశ్యం' జనహృదయాలపై పదావిలిచే కమనీయ కవితా దృశ్యం కాగలదు.

ఈ సంకలనంలో రచనా విధానాన్ని బట్టి మినీకవితలు దీర్ఘ కవితలు అనే రెండు వర్గములు; కవితావస్తువుని బట్టి 1) వ్యక్తిగత అనుభూతుల్ని రమణీయంగా మలిచిన కవితలు 2) సమాజంలో నెలకొనియున్న అవ్రకతుల్ని తన కవితా వీణియపై నిర్భయంగా పరికించిన కవితలుగా విభజించవచ్చును. ఈ రెండు విధానాల్లోను సాధనాలవారు అను కున్నది సాధించారని చెప్పాలి.

నాయుడిగారిలో ఉన్న ప్రధానగుణం. స్పందించే వారి హృదయం. అది అరుణోదయం లా కరుణామయం. చెప్పేవిషయాన్ని కరుణారసభరితంగా చెప్పడం వల్ల అది పాఠకుడి హృదయానికి చేరువ అవుతుంది. అభిమానాన్ని చూరగొంటుంది. బహుముఖ ప్రజ్ఞ కలవారి వ్యక్తిత్వం హరివిల్లు సదృశం. ఏడురంగుల హరివిల్లులో ప్రతిరంగు ఒక దానికి మరియొకటి సంపూరకంగా ఉండి మొత్తము మీద క్రొత్త సొగసులు ఎలా అందిస్తాయో, అదేవిధంగా వారి కవితా 'దృశ్యం' ఆవిష్కరణలో వారి విభిన్న ప్రతిభలు ఒకదానికి మరియొక్కటి దోహద పడినవి. వారు కవులేకాక పత్రికారచయిత, కథలు, గాయకులు, బి. ఎల్. పట్టాపొందారు. ఎం. ఫిల్, కొనసాగిస్తున్నారు.

ఈ సంకలనంలోని మొదటి కవిత 'మైదానం.' 'మైదానం నీది ఎంత విశాలహృదయం' అనడంలో నీరి ఆత్మీయతా ప్రవృత్తి,తో చూపు ద్యోతకమవుతాయి. ఒకే మైదానం వేరు, వేరు సంధర్భాలలో వేర్వేరు అవతారాలు ఎత్తుతుంది. మైదానం – బహిర్భూమి; మైదానం – పెరేడ్ గ్రౌండ్; మైదానం – ఉపన్యాసవేదిక; మైదానం – మధుపానప్రియుల ఆవాసం; చీకటిలో మైదానం – కామకేళి విలాసకేంద్రం: కొందరికి ఒడిలోచేర్చుకొని వేదదీర్చి, నిద్రపుచ్చే చల్లనితల్లి.

'అమ్మచెయ్యి' కవితలో అమ్మ ఓర్పుని, నేర్పుగా వివరిస్తారు.

'ఆ అరచేతిలో అమృత భాండాలుండేవి,
ఆకలి దప్పులు తీర్చే,
ధాన్యాగారాలు, తీపపదులు ఉండేవి,
ప్రతుకు భారాన్ని అవలీలగా,
మోయగలిగే క్రేన్లు ఉండేవి.'

ప్రకృతి సైతం ఒక్కొకసారి గొప్పవాళ్ళకి బందీ అవుతుంది. సామాన్యుడికి దూరం అవుతుంది. 'వాయువుతో విన్నపం' లోగాలిని గొప్పవాళ్ళ కూలర్లలో బందీ కావద్దని, కష్ట జీవి స్వేదబిందువుని పులకింపచేస్తేధాలని వేడు కొంటారు.

పాఠకుల్ని ఆకట్టుకోవడానికి వ్యంగ్య ప్రయోగాలు కవికి ఆయుధాలు,అని చక్కగా ప్రయోగించగలిగారు. కొన్ని కవితల్లో ఉదాహరణకు 'దేశమంటే మనుషులే' కవితలో కొన్ని పంక్తులు చూద్దాం –

'మతకలహాల మానవరుధిరం
కాషాయ వర్ణానికే కషాయం పోతుంటే,
ఉగ్ర స్వార్థపుటున్మత్త ధూమం,
తెలుపురంగుకు నలుపు పూస్తుంటే,
క్షామం, లంచావతార పతాకంలోనిపచ్చదనానికే
మచ్చతెస్తుంటే,
ఎవరన్నారు
దేశమంటే మనుషులేనని.'

కవిత్వంగూర్చి ఉదహరిస్తూ, డా. ఆచార్య భావన్‌గారు అంటారు.

'ఆ దేశాల పుట్టినిల్లు కాకూడదు కవిత్వం
ఆలోచనల హరివిల్లు కావాలి కవిత్వం,
కవిత్వం కావాలి సమస్త జనతా బంధువు,
కవిత్వం కావాలి మహోమహాల అకయ
సింధువు'

సాధనాల వారికవిత 'విషాదవిశాదినిలో కొన్ని పంక్తులు చూద్దాం.

'శేత పచ్చని మైదానం లాంటి పడుచు ధనం
జనుపదెక్కాల సాళవిక ప్రవృత్తికి
అదలగా బలై పోతుంటే,
విశాదికి నైరాశ్యం పెరిగింది.'

ఎంతచక్కటి కల్పన. భావంతుల్లో వ్యంగా రంఉంది. భీభత్సం ఉంది. ఆవేదనఉంది, కల్పన ఉంది. తత్వం ఉంది, కవికథాంతరంగాని

---

భూరేవాప్యుతి రిచ్ఛేత
పాపనిర్వ్యాతనం మహాత్
మను అధ్యా 12 శ్లో-126

తా. ఈమానవధర్మశాస్త్రపరిజ్ఞానము వాలింగు వేదముల నధ్యయనము చేసిన పుణ్యమును, అంతకంటె, హెచ్చుపుణ్యమును పొసంగును, పాపములెల్ల పోగొట్టుటయందు దీనిని మించినది మరి యొకటిలేదు.

(౧౦)

ఇది నిజప్రతిబింబం. ముఖ్యంగా ఇది పాత కుడిలో స్పష్టించగలదు ఆలోచనా తరంగం. కవిత చివరి పంక్తుల్లో 'ప్రాయశ్చిత్తంకోసం సూర్య శిశువుని ఆహ్వానిస్తోంది. నిశాధిని' అనడంలో కవి ఆలోచన హరివిల్లయి మన మనస్సులో విరుస్తుంది.

తన కవిత్వంతో సకలజనావళితో బంధుత్వం నెలకొల్పుకోవాలనే దృక్పథంతో 'రిక్షావాలా'కి, 'కార్యకర్త'కి దృశ్యంలో చోటిచ్చారు. 'రిక్షావాలా ఈ దేశపు శ్రమకు నిర్వచనమై సాగిపోతుంటాడని' ఉక్తినుడివారు. కార్యానికేకాదు కర్తవి, కర్మకి కర్తవి' అని కార్యకర్తను ఆత్మీయంగా పలుకరించారు.

కవిత్వమనేది మహామహుల ఆశయ సింధువు అయితే, ఆ సింధువు ఏర్పడ్డానికి తోడ్పడే బిందువులు వీరి కవితల్లోకూడా ఉన్నాయి. మానవునికి భౌతిక చక్షువులతో పాటు, జ్ఞాన చక్షువులుకూడా అవసరం అని తత్వవేత్తల నమ్మకం. 'అంధప్రమిద' కవితలో దీపావళి పండుగను వర్ణిస్తూ కవి అంటారు.

'భౌతిక జ్యోతులను వెలిగించి జ్ఞానదీపికలను వెలిగించకుండా ఏమి ప్రయోజనం.'

'కురిసే చినుకుల్లో' ఈయనకు అన్నార్తుల ఆర్తనాదాలు, అభాగినుల అంతఃమధన వేదనలు, ధరలమరల్లో నలిగి పోతున్న సామాన్యుని విలాపాలు కనిపిస్తాయి. దానికి ఆయన హృది ద్రవిస్తుంది. "కన్నీటిజడి కళ్ళను కప్పేస్తుంది." ఇది వీరిసామాజిక పరిశీలనకు ఓ చిహ్నం. 'దుప్పట్లో కళ్ళు'' కవితలో మత్తు ఆవరించిన కళ్ళకు వెలుగు సూదుల్లా గుచ్చుకుంటుంది' అని హెచ్చరిస్తారు.

'భూమి గుండ్రంగానే ఉంది.' కవిత నేటి నిరుద్యోగుల అవస్థకు, ఉద్యోగ ఎంపిక వ్యవస్థకు నిజప్రతిబింబాలు. 'కమలాఫలంలో గింజలెన్ని? పనసపండులో తొనలెన్ని'? వంటి ప్రశ్నలు కవితలో చొప్పించడం ద్వారా నేడు జరిగే బోగస్ ఇంటర్వ్యూల బండారం బయటపెట్టారు. "కదలాడే బాల్యం" కవితలో బాల్యంగురించి తలచుకుంటే ఎవరికైనావరే 'పెదవులపై తృప్తి చిరునవ్వుగా వెలుగుతుంది.' అనే సత్యం వివరించారు. 'పచ్చతోరణాలు' కవితలో వృక్షసంరక్షణ ఉద్యమ ప్రభావం కనిపిస్తుంది.

అధునికపై అభిమానమున్న ఈ కవికి మన ప్రాచీనకవులు, తెనుగు సంస్కృతి పైగల అభిమానానికి నిదర్శనం వారి కవిత "తెనుగుతల్లి."

'నన్నయ్య కవితా శరద్విభావరి,
తిక్కన్న కవితా మకరంద మాధురి
శ్రీనాధ కమనీయ కవితాలహరి
తెలుగు సాహితీ సుందరికి ఊపిరి'

ఆధునికత అనే కట్టడానికి పునాది ప్రాచీనతలో ఉందని నమ్మేవాళ్ళకి ఈ పంక్తులు నిత్యం పఠించదగ్గ సూక్తులు.

ఈ కవిలో ఆవేదన, ఆత్మీయతలతోపాటు చక్కని ఆదర్శంకూడా ఉంది. అందుకే అంటారు 'దాక్షిష క్రతువు'కవితలో.

'ఈ అంతరాలు, కుతంత్రాలు చూస్తుంటే
నా అంతరంగం అగ్నిగుండం అవుతుంది
నామనోనేత్రం త్రినేత్రమై జ్వలిస్తే,
ఈ సమాజం ప్రక్షాళనమై
నాస్వాప్నిక దాక్షిష క్రతువు
పరిసమాప్తమవుతుంది, ఫలప్రదమవుతుంది.'

తమ కవితల్ని "విశ్వచక్షువులు' 'గా చెప్పుకో గలిగిన ఆత్మవిశ్వాసం వీరికుంది. అందుకే అవి, "అజ్ఞాన తిమిరాలను తొలగిస్తాయ్, విజ్ఞాన కిరణాలను ప్రసరిస్తాయ్' అంటారు. వీరికి ప్రతివేకువ కోటికిరణాల క్రొత్తఊపిరినిస్తుంది. ప్రభాత కర్తవ్యాన్ని ప్రబోధిస్తుంది.

ఇక వీరి మినికవితల దగ్గరికివస్తే అవి నిజంగా కవితాహాపి వరికలు. వీటిల్లో సంక్షిప్తత, ప్రాసనియమం, మాటల్లో విరుపు, ఎత్తిపొడుపు, అనుభూతుల మెరుపు, లోకోక్తుల్ని లౌక్యంగా వాడుకొనే నేర్పు ఇమిడి ఉన్నాయి.

అమావాస్యనాడు పుట్టినవాడు దొంగో లేక దొరో అవుతాడన్నది లోకోక్తి. అయితే వీరు 'పొలిటీషియన్' కవితలో అంటున్నారు-

'ఓ అబ్బాయి పుట్టాడు అమావాస్యనాడు
అయితే దొర లేకుంటే దొంగఅవుతాడను
కున్నాం అనాడు
ఈనాడు-అతను దొంగల్లో దొర అయ్యాడు

మనం ఏప్రియల్ ఫస్ట్ నాడే ఇతరుల్ని ఫూల్స్ చేయగలం, లేకపోతే అవగలం, ఈ కవిమనల్ని సంవత్సరమంతా ఏప్రియల్ ఫూల్స్ చేస్తున్నారు. 'ఫూల్స్‌డే' కవితలో-

వాగ్దానాల ఎండమావులను
కురిపించే నాయకులకు
ప్రతిరోజు ఏప్రియల్ ఫస్ట
వానిలో దాహం తీర్చుకోవాలనుకునే
ప్రజలు ఎప్పుడూ ఫూల్స్.

అడిగేవాడికి చెప్పేవాడు లోకువ అంటాము. కాని ఈయన క్రిందన రాసేవాడు మీదన వ్రాసేవాడికి లోకువ అంటున్నారు. 'మహిమ' కవితలో.

నల్లసిరా ఎర్రసిరాకి లోకువ,
ఎర్రసిరా పచ్చసిరాకి లోకువ,
అన్ని సిరాలు పచ్చకాగితానికి లోకువ.

అల్పాక్షరాల్లో అనల్పార్థానికి వీరి కవిత 'గుణం' చక్కని ఉదాహరణ.

'మమకారం మల్లెతీగె, అధికారం కందిరీగ'

ఎత్తిపొడుపుల మాటకొస్తే-ఎన్నికలవ్యవస్థపై 'ఫలితం' కవిత—

'నియోజకవర్గం ఓ కమతం అయితే పేరుకు
పెత్తందారు ఓటరు
కాని అకమతానికి ప్రజాప్రతినిధే శాశ్వత
కౌలుదారు.'

చరిత్రపై 'చరిత్ర చిత్రం' కవిత—

'ఈ ధరిత్రిపై నిలిచేది చరిత్రే'

ఆ చరిత్రలో బలవంతుడిది దిగ్విజయయాత్ర
బలహీనుడిది కన్నీటి పాత్ర.'

ప్రజాస్వామ్యంపై 'విజరూపం' కవిత-
'ప్రజాస్వామ్యం మేడిపండు, రాజకీయం
కుళ్ళిన విభూతిపండు'

కుళ్ళిన కోడిగ్రుడ్డు అనవచ్చు కాని విభూతి పండనే వాడుకలో ఉన్న పదాన్నివాడారు.

'శైశవం' కవితలో చక్కని విరుపున్నది-
ప్రాణికి ఊపిరిపోస్తే శైశవం,
ఊపిరి తీస్తే - శవం.'

'వలువ' కవితలో విప్లవం ఫ్లాష్‌చూడండి -
'వలువని అలుసు చేయకు
అది తలుచుకుంటే
కన్నీటిని రప్పిస్తుంది
మరీ కోపగిస్తే -
జీవితాన్నే అంధకారం చేస్తుంది.'

అయితే వీరికవిత 'యజ్ఞం'లో ఒక విరుద్ధత గోచరిస్తుంది.
'ఈదేశ హోమగుండంలో
కులమత మౌఢ్యాలను
వర్గవిభేదాలను,
అంధవిశ్వాసాలను,
కట్టెలుగా పేర్చి,
అవినీతిని ఆజ్యంగాపోసి
యజ్ఞం చేద్దాం
క్రాంతి కలిగిద్దాం'

ఉన్నది హోమగుండం, చేస్తున్నది యజ్ఞం, వస్తువులన్నీ చూస్తే అపవిత్రమైనవి. పోస్తున్నది అవినీతి ఆజ్యం, అప్పుడు మిరుమిట్లు గొలిపే కాంతివచ్చి, బూడిద మిగులుతుంది. కాని క్రాంతి ఎలా కలుగుతుంది?

వీరికవితల్లో కన్పించే 'ఎప్సిలాన్, ఇన్ఫినిటీ, బాక్టీరియా' వంటి శాస్త్రీయపద ప్రయోగాలు వీరిశాస్త్ర పరిజ్ఞానాన్ని తెలియచేస్తాయి. 'గోల్డ్‌మెడల్' కవిత చూడండి—
యూనివర్సిటీ ఇచ్చిన్ గోల్డ్‌మెడల్‌ను అమ్ముదామనుకుంటే దాని విలువ 'ఎప్సిలాన్', మెడలో వేసికొందామనుకుంటే దానివిలువ 'ఇన్ఫినిటీ'.

ప్రేమకవిత -

ప్రపంచంలో ప్రేమ బాక్టీరియా విస్తరిస్తుంది అంతరించదు.

ఈ సంకలనంలో 'కుక్కపిల్ల', 'సబ్బుబిళ్ళ' వంటి అనుసరణ కవితలు 'అతడు (బాలుడు) ప్రపంచాన్నే జయించగలడు' అని సందేశమిచ్చే ఒక అనువాద కవిత ఉన్నాయి.

కన్నులకు కట్టినట్లు అనుభూతి చిత్రాలను అందించే సుందరకావ్యం 'దృశ్యం' చూడగానే సౌందర్యం ఉట్టిపడేటట్లు చక్కటిముఖచిత్రం, స్ఫుటమైన అక్షరాల పేజీలలో ముచ్చటగా ఉంది. వీరు తమ ఈకృతిని తల్లిదండ్రులకు, అంకితం కావించి తమ రచనావ్యాసంగానికి ఓ అర్థం కల్పించుకున్నారు. అంతేకాదు. వీరికృతి, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డిగారి ఆశీస్సుల ఉషోదయకిరణాల స్పర్శతో పులకరించింది.

సాధనాల వేంకట స్వామినాయుడుగారు కవితారంగంలో తమ ఇంటిపేరుని సార్థకం చేసికొని, తనదంటూ ఓ పేరు నిలుపుకోవాలని నా ఆకాంక్ష, కవిత్వంపై అభిమానమున్న వారంతా ఈ పుస్తకం చదవాలని నా అభిలాష. పుస్తకం వెల 15-రు/. కాపీలకు దిగువ చిరునామాకు వ్రాయండి.

శ్రీ S. V. A. S. నాయుడు,
46 11-41, దానవాయిపేట,
రాజమండ్రి - 533103.

—...—

# 10. ఆధునిక సాహిత్య చైతన్యంపై అధ్యయన గోష్ఠి

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

3-9-90 ఉదయం ప్రభుత్వ కళాశాల స్నాతకోత్తరవిభాగం. తెలుగుశాఖలో అధ్యాపకులనుద్దేశించి వజ్రాయుధకవి శ్రీ సోమసుందర్ (కళాకేళినికేతనం, పిఠాపురం) ఆధునిక సాహిత్య చైతన్యం భారతదేశంలోనూ ఆంధ్రదేశంలోనూ సమకాలిక సాంఘిక రాజకీయ విద్యా రంగాలనుంచి ఎలా విస్తరించి పురివిప్పుకున్నదో సుదీర్ఘంగా వివరించారు. త్యాగరాజు పాటలతోనే తెలుగుజాతి సాంస్కృతికంగా విముక్తి పొందిందంటూ వీరేశలింగం గురజాడలు సాంఘిక సాహిత్యరంగాలలో ఆధునిక చైతన్యానికి బీజావాపనం చేశారనీ ఉద్ఘాటించారు. ఏ ఉద్యమమూ శూన్యంనుంచి రాదనీ పరిసరాలు వ్యతిరేకంగా ఉన్నప్పుడు ఉద్యమం రాకతప్పదనీ అయితే మనిషి చింతన పరిపక్వం కానిదే, ఉద్యమం ఫలప్రాప్తి కలిగించదనీ ఆయన స్పష్టం చేశారు.

స్నాతకోత్తరవిభాగ-తెలుగు అధ్యాపకులంతా హాజరైన ఈసభను ప్రారంభిస్తూ తెలుగుశాఖాధిపతి డా॥ మిరియాల రామకృష్ణ నాలుగుదశాబ్దాలుగా సోమసుందర్ కొనసాగిస్తున్న నిరంతరసాహితీ వ్యవసాయాన్ని సమీక్షించి ఆయన పొందిన ఫలితాలను విద్యార్థులకు పరిచయం చేశారు.

మన ప్రాచీన సంప్రదాయ మహాప్రస్థానంలోని మంచిచెడులను క్షుణ్ణంగా పరిశీలించి, ఆంగ్లభాషద్వారా అందరికీ అందించిన రాజరామ్‌మోహన్‌రాయ్ మనకు చిరస్మరణీయుడన్నారు సోమసుందర్. తంజావూరు నాయక రాజయుగాన్ని

కోంటారు సాహిత్యవేత్తలు అంథయుగం అని పేర్కొనడం దురదృష్టకరం అని అభిప్రాయపడ్డారాయన. వచనాన్ని వ్యవహారికంలో అందరికీ అర్థంకావాలన్న తపనతో రాసిన సామినేని ముద్దు నరసింహంను సంస్మరించారాయన. సమాజంలో స్త్రీ దీనపరిస్థితిని చూసి ద్రవించి, సమాజాన్ని కదిగివేయడానికి పూనుకున్న వీరేశలింగంతోనే మన ఆధునిక సాహిత్యచైతన్యం మొదలయిందనినిష్కర్షగా నిరూపించారు. కన్యాశుల్కంవంటి పరిణత దృశ్యకావ్యరూపం రావడానికి వీరేశలింగంగారి బ్రాహ్మవివాహంతో పాటు రవీంద్రుడు గురజాడకు సాహిత్య భాషగురించి చెప్పిన సందేశంయొక్క దోహదం కూడా ఉందన్నారు సోమసుందర్.

తెలుగులెక్చరర్ శ్రీ కే. వి. యస్. లక్ష్మణరావు ధావకత్వం, మీద జరిగిన చర్చలో పాల్గొని గోష్ఠికి వెలుగునిచ్చారు. కుమారి జి. మహాలక్ష్మి (ఎం. ఏ. ఫైనలు) ఆధునిక సాహిత్యానికి వ్యాకరణం వద్దా అని సందేహం వెలిబుచ్చగా తెలుగువారున్న వ్యాకరణ దీపం ఉన్నదనీ అక్షరం తయారు లక్షణమనీ అందరూ తీర్మానించారు. ఎం. ఏ. ఫైనలు విద్యార్థిని శ్రీమతి బాబిలాల ఇందుమతి హృద్య అభినందనలు తెలిపారు.



## 11. మాదిరాజు రంగారావు కావ్యాలు-ఒక విశ్లేషణ

— శ్రీ పాతూరి రఘురామయ్య

1970 నుండి 1989 దాకా మాదిరాజు కవితాసంపుటాలు పందొమ్మిది పుస్తకాలుగా ప్రచురితమైనవి. వారి కావ్యాలు వెలుగులోకి రావటానికి సహకరించిన సంస్థలు మూడు. 1. సాహితీ బంధు బృందం 2. రసధుని 3. సాహితీ సమితి.

సాహితీబంధు బృందం తరపున ఈ క్రింది కావ్యాలు ప్రచురితమైనవి. 1. యుగసంకేతం 1970. (ఇందులోనే కోల్కొన్న ఆకాశం కూడా ఉంది) 2, ముక్తకాలు-ఉష ఆగమనం 1970 (ఇవి రెండుకావ్యాల సంపుటం) 3. కోల్కొన్న ఈ సమయం 1975 4. ఆనందధుని 5. శబ్దమై ప్రాణమై 1976 6. వెలుగులో ఈ నేలపై 1974.

సాహితీ బంధుబృందం తరపున ఆరు పుస్తకాలు (ఎనిమిది కావ్యాలు) ప్రచురితమైనవి. డా॥ పేర్వారం జగన్నాథం గారు ఈ సంస్థకు కార్యదర్శిగా తెలుగు సాహిత్యసేవ ఎంతగానో చేస్తున్నారు. 1987లో అభ్యుదయ కవిత్వానంతర ధోరణులనే చర్చాగోష్ఠి సంకలనం (వ్యాస సంపుటం) కూడా ప్రచురించి సాహిత్య ప్రపంచంలోనే క్రొత్తదనాన్ని ప్రసరింపజేశారు. ఈ సంస్థసేవలకు తెలుగుపాఠకులు ఎంతగానో ఋణపడియున్నారు.

రసధుని ఈ క్రింది పుస్తకాల్ని ప్రచురించింది. 1. మానవీయం 1971 2. వరుతిక్ వైరాగంతో 1972 3. ముక్తధార 1972 4. పడగెత్తిన ఉదయం 1978 5. ఆవాహన 1978 6. కాలాన్ని నిలిపిక్షణం 1979 7. అంతరం స్వరచిత్రం 1986 8. నాకజ్ఞాపకం ఉంది 1987 9. అగ్ని మయం జీవితం 1988.

ఈతొమ్మిది పుస్తకాల్లో పన్నెండు కావ్యాలు ఉన్నవి. ఆవాహనలో నాలుగు కావ్యాలున్నవి. అవి 1. విప్లవచ్ఛాయల్లో వియత్నాం 2. రేఖాచిత్రాలు 3. మినీ కవితలు 4. అస్మృతిలిప్తలు.

రసధుని కవియొక్క స్వీయసంస్థ. అంటే తాను స్వయంగా ప్రచురించిన కావ్యాలు పన్నెండు.

సాహితీసమితి ఈ క్రింది కావ్యాల్ని ప్రచురించింది. 1. నాలో ప్రవహిస్తోంది నది 1985 2. కర్పూరం జీవనబింబం 1989.

సాహితీసమితి శ్రీ నమిలికొండ బాలకిషన్ రావుగారి అధ్వర్యంలో ఓరుగల్లులో సాహితీసేవకు కంకణం కట్టుకొన్న సంస్థ. శ్రీ నమిలికొండ బాలకిషన్ రావు గారు స్వయంగా కవి, న్యాయవాద వృత్తిలో ఉన్నా వీరిలో ఇతోధికమైన సాహితీసేవాభిలాష ఉండటం ప్రశంసనీయం.

మాదిరాజు రంగారావుగారి సంస్కారచిత్తమో, సాహితీబంధుబృంద సహృదయ రంజకత్వ వాసనావిశేషమో ఏ కారణం వల్లనో గాని వీరి కావ్యాల్ని (ఒక్క మానవీయం తప్ప - ఇది జూన్ 1971 లో.) పండగ సందర్భాల్లోనే వెలుగు చూడటం చెప్పుకోదగ్గ విశేషం.

విజయదశమి సందర్భంగా ముక్తకాలు ఉపాగమనం, ఆవాహన, నాలో ప్రవహిస్తోంది నది, అగ్నిమయం జీవితం ప్రచురితమాలు.

సంక్రాంతి సందర్భంగా యుగసంకేతం, పడగెత్తిన ఉదయం, ఆనందధ్వని, కాలాన్ని నిలిపే క్షణం అని పిలువబడుతున్న ఈ నాలుగు సంపుటాలూ ఆవిష్కృతాలు.

ఉగాది సందర్భంగా వయొలిన్ పై రాగంలో, ముక్తధాత్రి, వెలుగులో ఈ నేలపై, మేల్కొన్న ఈ సమయం నాకు జ్ఞాపకం ఉంది, ఈతరం స్వర చిత్రం కిర్మీరం జీవనబింబం- ఈ ఏడు కావ్యాలూ వెలుగులోకి వచ్చాయి.

రిపబ్లిక్ డే సందర్భంగా శబ్దమై ప్రాణమై అన్నకావ్యం ఆవిష్కృతమైంది.

నివ్వాలు కాక కవిత్వమే కవిత్వంగా పాఠకలోకం భ్రమిస్తున్న ఆధునిక యుగంలో నీటినికూడా కరిపిస్తూ పుష్పాల్ని పూయిస్తూ సకలమానవ శ్రేయస్సు కోసం సంస్కారభావనా సంయుతమైన అభ్యుదయ కవిత్వాన్ని కళామయంగా ఆవిష్కరిస్తున్న నిరాడంబర కవి మాదిరాజు రంగారావు.

పై విశ్లేషణమూలంగా విజయదశమి సంపుటాలు, సంక్రాంతి సంపుటాలు, ఉగాది సంపుటాలు అని వ్యవహరించడంలో దోషము వ్యంగ్యము.

0—0

## శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి జయంతి

ద్వితీయ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి 124వ జయంతి సందర్భంగా కళాప్రపూర్ణ డాక్టరు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి ఈనెల 9న స్థానిక లక్ష్మీనరసమ్మ కాన్వెంటు స్కూలులో జరిగిన సభకు అధ్యక్షత వహించి శ్రీ శాస్త్రి పరిపూర్ణ సాహితీమూర్తి అని ప్రశంసించారు.

శ్రీపాదవారు రచించిన శ్రీకృష్ణరామాయణంపై సమగ్రపరిశోధన గావించిన పాలకొల్లు ఓరియంటల్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిని 'శాస్త్రి' బిరుదముతోను, పట్టువస్త్రాలతోను సన్మానించారు. ఇతిహాసమ్మలైన భారతభాగవత రామాయణములను పరిశోధనా గ్రంథాలుగా అనువదించటమే గాకుండా 250కి పైగా ఇతర గ్రంథరాజములను వ్రాసిన కవి నభూతో న భవిష్యతి అని శ్రద్ధాంజలి ఘటించారు. వ్యాస వాల్మీకుల సమష్టిరూపం శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారని సభా ప్రారంభం చేస్తు గౌతమీ విద్యాపీఠం సంస్కృత డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ నివాళులర్పించారు. తొలుత శ్రీ తెలికిచర్ల కృష్ణమూర్తి భాగవతార్ ప్రార్థనతో సభ ప్రారంభమైనది.

శ్రీ మధునాపంతుల వారిని పట్టు వస్త్రములతో శ్రీ బుగ్గా పాపయ్య శాస్త్రి గౌరవించారు. శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి ప్రసంగిస్తూ అప్పటి రాష్ట్రపతి అవార్డు గ్రహీత శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి 94 సం॥లు జీవించి సాహిత్య చరిత్రను సృష్టించిన మహాకవి సార్వభౌములని, కవిసార్వభౌమ బిరుదు ప్రదానం పాలకొల్లులో జరిగినకనకాభిషేక సభలో ఇచ్చినదని, దర్శిలా గుంటూరులో జరిగిన ఒక పండితసభలో బిరుదును నిర్ధారణచేసినట్లు వివరించారు. 1958 లో అనకాపల్లి సభలో స్వర్ణకంకణ ప్రదానం చేస్తూ కవితాభూషణబిరుదు ప్రదానం చేశారని, ఒక పండితసభలో గండపెండేరాన్ని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి అలంకరించారని. విశ్వనాథ సత్యనారాయణగారితో జరిగిన సభకు శ్రీ అవసరాల రామారావు అధ్యక్షత వహించారని పేర్కొన్నారు. కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వయంగా శేషవస్త్రాలనొసంగి ఆశీస్సునందజేశారని కవిసార్వభౌముల జీవితవిశేషాలను వివరించారు. ప్రజాయుధం, గౌతమి, మానవసేవ, వందేమాతరం పత్రికలు గ్రాంథికభాషలో వీరి సంపాదకత్వంలో వెలువడేవని, 'కళావతి' ప్రింటింగ్‌ప్రెస్‌ను మద్రాసులో కొంతకాలం నడిపినారని 29-12-1960లో పుష్యశుద్ధద్వాదశినాడు వారు కీర్తిశేషులైనారని, వీరి గ్రంథాలను పునర్ముద్రించి ఆచంద్రతారార్కం కాపాడుకోవలసిన బాధ్యత మనదని అన్నారు. త్వరలో ప్రారంభించనున్న నూతన సాహితీ సంస్థ 'యువస్వరం' వీరి జయంత్యుత్సవాలను ప్రతిసం॥రం నిర్వహించడానికి ఉత్సుకతతో వుందని తెల్పారు. వీరు వ్రాసిన నాటకాలలో బొబ్బిలియుద్ధం అనేక ప్రదర్శనలు నోచుకున్నదని అన్నారు.

గ్రాంథికభాషలో ప్రజాయుధం పత్రికనడపడం శ్రీశాస్త్రిగొప్పతనమని, ఆరోజుల్లో కవి శ్రీగిడుగు రామ్మూర్తివంటి వారు వ్యావహారిక భాషోద్యమాన్ని నడిపేవారని శ్రీ పోతుకూచి సూర్యనారాయణ చెప్పారు. యువకవి శ్రీ సన్నిధానం నరసింహశర్మ ప్రసంగిస్తూ ప్రశంసలతో పాటు విమర్శలు కూడ చేసినట్లైతే

రచనయొక్క సమగ్రరూపం తెలుస్తుందని, శ్రీపాద వారి గ్రంథములలో ఏరిన పద్యాలను సంకలనంగా ప్రచురిస్తే, విశ్వవిద్యాలయాల్లో పరిశోధకులకు సహకారాన్ని యిస్తుందని అన్నారు.

డాక్టరు జొన్నలగడ్డ మృత్యుంజయరావు ప్రసంగిస్తూ శ్రీనాథుడు, పోతన, నన్నయలు ఒక్క శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారిలో మూర్తిభవించారని స్వీయపద్యం వినిపించారు.

కల్లూరివారి కోడలు శ్రీమతి సీతామహాలక్ష్మి శాంతగారి భాగవతంలోని రుక్మిణీకళ్యాణ ఘట్టంలోని కొన్ని పద్యాలు చదివి వినిపించారు.

శ్రీయుతులు మల్లంపల్లి దుర్గా మల్లికార్జున ప్రసాద్, సి. నరసింహాచారి, రామేన బ్రహ్మం ప్రభృతులు ప్రసంగించారు.

సన్మానితులు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి [illegible] ప్రసంగిస్తూ శ్రీకృష్ణరా[illegible] మూలాన్ని అనుసరించిగాక స్వతంత్ర కవిత్వంతో కూడుకున్నదని వివరించారు. తమ గైడు ప్రకాశరావుగారికి మొదట 1450 పేజీల పరిశోధనా వ్యాసాన్ని అతికష్టం మీద 460 పైపు పేజీలకు కుదించి విశ్వవిద్యాలయంకు సమర్పించగా పి.హెచ్.డి యిచ్చారని, తమ గురుదేవులు డా. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి చేత సన్మానింపబడటం నేడు అత్యంతానందాన్నిస్తోందని, కార్యనిర్వాహకులకు కృతజ్ఞతలు తెల్పారు.

కర్తలను ఫల తాంబూలములతో సత్కరించి శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రి [illegible] సమర్పణ గావించారు.

నాటి ఉదయం శ్రీ రామేన బ్రహ్మం దంపతులు రాజమండ్రి మ్యునిసిపల్ కార్యాలయంలోగల 1941 లో శ్రీమతి చెల్లాయమ్మ ప్రతిష్ఠించిన శ్రీపాదవారి శిలావిగ్రహానికి పూజాదికములు నిర్వహించారు.

[శ్రీ సత్యవోలు]

.... .... ....

## నన్నయభట్టారకుని

## —— భారత సూక్తిరత్నములు ——

సంకలనం :

### కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్
గట్టిన కర్మఫలంబుల
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్.

ఆది 5_69

ఎంతటి సదాచారసంపన్నమైన కులమునఁ బుట్టినవాఁడైనను పూర్వజన్మమునఁ గూడఁబెట్టిన కర్మఫలము తప్పక అనుభవించి తీరవలయును.

ధనపతితో దరిద్రునకుఁ
దత్త్వవిదుండగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁ
గ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూథితోడ విర
థికి సజ్జనుతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను
సఖ్యము దా నొడఁగూడ నేర్చునే.

ఆది 5_204

ధనవంతునితో దరిద్రునకు, తత్త్వవేత్తతో మూర్ఖునకు, మిక్కిలి శాంతస్వభావునితోఁ గ్రూరునకు, యుద్ధవీరునితోఁ బిఱికివానికిఁ, సైన్యము గలవానితో సేనారహితునకు, సత్పురుషునితో దుర్మార్గునకు నేవిధముగను స్నేహము కుదురఁజాలదు.

సమశీల శ్రుతయుతులకు
సమధనవంతులకు సమసుచారిత్రులకుం
దమలో సఖ్యము వివా
హము నగుఁగా కగునె రెండు
నసమానులకున్.

ఆది 5_205

సమానమైన స్వభావము, వేదశాస్త్ర విజ్ఞానము గలవారికి; సమానమైన ధనము గలవారికి; సమానమైన సచ్ఛరిత్రము గలవారికి; స్నేహము, వివాహము కుదురును గాని పై రెండు నసమానులకు దటస్థింపవు.

Editor. Printer and Publisher B. Ravikanth. Printed at B. V. & Co. Press.